చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, పాటలు, ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.


చందమామ పబ్లికేషన్స్

కోడంబాకం :: మదరాసు - 24




## చందమామ

## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేరనిఎడల మొదటి ఆరుతారీఖుల లోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు అమోదింప బడవు. గడచిన మాసములలో చేరలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

# చందమామ

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 10 : సంచిక 5 మే 1952

మనసు అనేది చాలా చిత్రమైనది. అది కంటికి కనపడదు. ఐనా, దానిని గురించి తరుచు ప్రస్తావన చేయక తప్పదు. ఈ మనసు ఒక్కొక్క మనిషిలో ఒక్కొక్కవిధంగా వుంటుంది. ఒకరి మనసు మరొకరు తెలుసుకోవటం కష్టమైనపని. తెలుసుకోగలిగితే జీవితంలో జయంకలిగినట్టే. నిజానికి అలా తెలుసుకోగలవాళ్ళు లోకంలో కొద్దిమందేవుంటారు. వాళ్లే తెలివిమంతులు. మనస్సును తెలుసుకోగలగటాన్నే మనస్తత్వశాస్త్రమని అంటారు. ఇది తెలుసుకున్నవాళ్లు అన్నివిధాలా సౌఖ్యం పొందుతారు. అందుకనే ఇది అందరకూ జీవితంలో అవసరమైవుంది. ఈ సంచికలో 'మణులూ-రత్నాలూ' అనే కథ ఇటువంటి మనోశాస్త్రానికి సంబంధించిందే. ఇందులో ఆదిత్యుడు మనస్తత్వ శాస్త్రంలో ప్రవీణుడు. కనుకనే, ఎందరెందరో వచ్చి రాజకుమార్తెల మనస్సులు కనిపెట్టలేకపోయినా, అతడు తన తెలివివల్ల వాళ్ళ తత్వాలను తెలుసుకుని, వాళ్లచేత మణులూ రత్నాలూ కురిపించగలిగాడు. దీన్నిబట్టి - మనస్తత్వశాస్త్రం కృషి చేసిన వాళ్ళకు అసాధ్యమనేదేదీ ఉండదనీ, జీవితం జయప్రదం చేసుకోగలరనీ తెల్లమవుతున్నది. ఇదే మన పెద్దలు 'మనసు ఎరిగి మసులుకోవట' మని చెబుతారు. దీనిని అవలంబిస్తే ఎంతైనా మేలు కలుగుతుంది.











# మాట మీరని ఏనుగ

ఒకసారొక భీకర యుద్ధంలో
ముసలి ఏనుగొక్కటి పాల్గొంది.
మావటి తప్ప దానిమీ దెవ్వరు
లేరు, రాజుజండామటు కుంది.

కత్తులు తళతళమని మెరిశాయి
నెత్తురు వాగులుగా పారింది.
చెలరేగిన సంకుల సమరంలో
మెత్తని నేల ఎఱ్ఱబారింది.

రాజుగారి పక్షానికి ఓటమి
తప్పదన్న సంగతి తేలింది.
రక్షణశ్రేణులు పటాపంచలై
సైన్యం వెనుకకొదిగి వాలింది.

ఆగన్నాడు ఏనుగను మావటి.
ముసలి ఏనుగక్కడ ఆగింది.
శత్రుసైన్య మొక పెనువెల్లువగా
పొంగిపొరలి పైబడసాగింది.

మావటి ప్రాణాలను ఒక శాత్రవ
బాణం హరించింది ఒక త్రుటిలో
జండా ఎగురుతోంది. నిలచిందా
ఏనుగు కదలక ప్రళయార్భటిలో.

రచన:
"బైరాగి"

ఎగిరే జండా చూచి సైనికులు
గుండెదిటవుగొని గుమిగూడారు.
నేడు విజయమో, వీరస్వర్గమో
అని తెగింపుతో పోరాడారు.

తుట్టతుదను గెలిచారెట్లాగో
పోతున్నారు మరలి తమ యింటికి.
ఏనుగమటుకు కదలనంటున్నది
అతికిపోయినట్లక్కడ మంటికి.

అప్పుడు రప్పించారిక మావటి
కొడుకును ఏనుగుకోస మక్కడికి.
అతడు వచ్చి రమ్మనినవెంటనే
ఏనుగ కదలిపోయినది ఇంటికి.

ఒడలు బదాబదలైనది, నెత్తురు
చిమ్ముతోంది గాయాల్లోనుంచి.
కడకు చచ్చినది ఏనుగ తన తల
మావటి కొడుకు కాళ్ళకానించి.

ఎత్తిన జండా దించలేదు మరి
వేసినకాలు కదపనేలేదు.
యుద్ధం గెలిపించిందా ఏనుగ
మావటిమాట మీరినదికాదు.



# రెండు నవ్వులు

*

ఒకానొక రాజ్యంలో సోమరులు ఎక్కువ కావటం కనిపెట్టి, ఆ దేశపు రాజు ఒక చిత్రంచేశాడు. ఆయన అజ్ఞప్రకారం రాజ్యమంతటా చాటింపు జరిగింది: 'ఎవరైతే కోటలో రాజభోగాలు అనుభవిస్తూ, వారంరోజులపాటు పడుకొని వుంటాడో వాడిని యావజ్జీవమూ రాజుగారే పోషిస్తారు' అని ఆ చాటింపు.

ఇది విన్న ప్రతివాళ్ళూ చంకలు ఎగురవేశారు—'ఇంతకంటె మానవుడికి కావాలిసిందేమిటి? ఒక్క వారం రోజులు పడుకొనివుండటం అదొక పెద్ద పనిగనకనా? ఈ కాస్తపనీ చేస్తే చాలు, జీవితమంతా హాయిగా ఉండవచ్చు' అని అనుకోసాగారు.

మంత్రి కంగారుపడుతూ వచ్చి, "ప్రభూ!—విడ్డూరమైన ఈ చాటింపు యేమిటి? ఎక్కడలేని ప్రజావచ్చి మన మీద పడిపోరా? తీరావస్తే మనం ఆపగలమా?" అంటూ మనసులోని ఆవేదన వెల్లడించాడు. అందుకు రాజు చిరునవ్వు నవ్వి ఊరకున్నాడు. ఆ నవ్వు మంత్రికి అర్థంకాలేదు.

రాజు వేయించిన చాటింపు విని ఒకడు వచ్చాడు కోటకు. వాడికి రాజు ఒక గది చూపించాడు. ఆ గది శోభాయమానంగా వున్నది. 'నాయనా!—అదుగో హంసతూలికాతల్పం. దానిమీద పడుకో. ఈ వారంరోజులూ నీవు కాలు కిందికి దింపకూడదు. ఏమి కావలిస్తే అది నీ తల్పంవద్దకే వస్తుంది,' అని చెప్పాడు. అపరిమితానందం పొందాడు ఆ వచ్చినవాడు. రాజు అమాయకత్వానికి మంత్రి ఎంతగానో చింతించాడు.

పడుకొన్నవాడికి మొదటిరోజు సౌఖ్యంగానే తోచింది. మరునాడుకూడా సౌఖ్యంగానే తోచిందికాని, ఆ సౌఖ్యంలో తీయదనం ఒక్కగీటు తగ్గిందనిపించింది. రాజభోగ్యమైన సమస్త సదుపాయాలూ జరుగుతున్నప్పటికీ మూడవ రోజున ఇక వాడు పడుకొని ఉండలేక పోయాడు. కొంచెం లేచి, కిటికీదాకా నాలుగడుగులు వేసివస్తానని ప్రాథేయపడ్డాడు. రాజుగారు ఎంతమాత్రం వప్పలేదు. వారంరోజులూ పడుకోవలసిందే నని కచితంగా చెప్పారు.

నాలుగోరోజున వాడు గదిలో కనిపించటంలేదని పుకారు పుట్టింది. ఈ మాట చెప్పటానికని వెళ్ళాడు మంత్రి. అప్పుడు రాజు మళ్ళీ రెండవసారి చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులోని అంతరార్థం ఈమారు గ్రహించాడు మంత్రి.



# బంగారు పంజరం

గురవయ్యశెట్టి ముసలివాడయ్యాడు. పెద్ద పెద్ద వ్యాపారాలుచేసి లక్షలూ, కోట్లూ ధనం సంపాయించిన అతడికి యిక విశ్రాంతి తీసుకోవడం ఉత్తమ మనిపించింది.

కృష్ణానదీతీరాన విశాల సుందరమైన భవనం కట్టించాడు. భవనంచుట్టూ చక్కని పూలతోటలు వేయించాడు. అక్కడ వెలసిన వివిధ ఫలవృక్షాల తోపులు ఆ ప్రదేశమంతటినీ నందవనంలా కనిపించేటట్టు చేసినై.

ఒకనాటి వుదయం గురవయ్యశెట్టి షికారు వెళ్లాడు. విరియబూసిన మామిడి చెట్లనీడను, తను మామూలుగా కూర్చునే తిన్నెమీద కూర్చున్నాడు. చల్లనిగాలి, ఆనందాన్నికొల్పే వివిధ పుష్పవాసనలు, పక్షుల కలకలారవాలు, అంతా ఆనందమయంగా వుంది.

గురవయ్యశెట్టి ఒక రాటకు చేరగిలబడి విరియబూసిన మామిడిచెట్ల కొమ్మల వంక చూస్తున్నాడు. సరీగా అతడు చూస్తున్న కొమ్మలమీదికే ఒక పక్షివచ్చి వాలటం అతడికి కనబడింది. అతడు ఆశ్చర్యపడ్డాడు. ఏమంటే అది మామూలుగా కనబడుతూవుండే సామాన్యపు పక్షి కాదు. ఇంద్రధనస్సులో ఎన్ని రంగులైతే వుంటవో, అన్నిరంగులూ దాని శరీరంమీద అద్దినట్లుగా మెరుస్తున్నయ్. మెడకింద మాత్రం మెరిసిపోతున్న మేలిమిరంగు చార వున్నది!

రెప్పవాల్చకుండా గురవయ్యశెట్టి అలా ఆ పక్షివంకనే చూస్తూవున్నాడు. రెండు మూడునిమిషాలు గడిచేటప్పటికల్లా, ఆ పక్షి ఎంతో మృదుమధురంగా గొంతెత్తి పాడనారంభించింది. కోవెల కంఠస్వరం దాని ముందు తీసికట్టుగా తోచింది. దారితప్పిన ఏ కిన్నెరకన్యో, పక్షిగా మారి పాడుతున్నదా అనిపించింది ఆ కంఠస్వరం.

జి. పద్మనాభం - ఖమ్మమ్మెట్టు



పక్షి పాడడం ఆగిపోయింది. గురవయ్యశెట్టి చెవులురిక్కించి, కళ్ళప్పగించి అలాగే చూస్తున్నాడు. పాట ఆగడం, ఆ పక్షి సన్నని కంఠంలోనుంచి మెరుపురవ్వల్లాగా జలజలా ఏవో క్రిందకు రాలడం అంతా ఒక్కసారే జరిగింది. అతడు మరీ ఆశ్చర్యపోయాడు. తిన్నెమీదినించి లేచి గబగబా ఆ పక్షికూర్చున్న కొమ్మవద్దకు నడిచాడు. అక్కడ, ఆ చెట్టుకింద గుబురుగా పెరిగిన పచ్చికలో తళతళా మెరుస్తున్న బంగారు శకలాలు అతడికంటబడినై.

గురవయ్యశెట్టి మితిలేని ఆనందం పొందాడు. ఆ బంగారాన్ని చేతిలోకి తీసుకుని పరీక్షించి, గుట్టుగా జేబులో వేసుకున్నాడు తలెత్తి మళ్ళీ కొమ్మలవంక చూశాడు. కాని ఆ బంగారుపక్షి అక్కడ లేదు.

మరుసటిరోజునా అదేవేళకు అక్కడికి వచ్చాడు. కాని ఆ బంగారుపక్షి రాలేదు. ఇలా పదిరోజులు గడచిన తరువాత హఠాత్తుగా ఆ పక్షి తిరిగి ఓనాటి వుదయం మునుపటి వేళకే వచ్చి వాలింది. పాడింది. గురవయ్యశెట్టి తన్మయత్వంలో ఆ పాట విన్నాడు; తరవాత ఆ బంగారు శకలాల్ని ఇదివరకులాగానే పోగుచేసుకున్నాడు.

రోజులూ, వారాలూ గడిచిపోతున్నయ్. ఐనా, ఆ బంగారుపక్షి మళ్ళీ రావడం జరగలేదు. గురవయ్యశెట్టికి గుబులూ, ఢిగులూ పట్టుకొన్నది. ఆ బంగారుపక్షి కంఠంనుంచి వెలువడే బంగారంమీదికన్న, అది పాడే పాటమీదనే అతడికి మమకారం ఎక్కువయింది.

తన భవనంలో పనిచేసే నౌకర్లకేగాక, చుట్టుప్రక్కల పల్లెలలో ఉండేవాళ్లకూ డా ఆ పక్షిని పట్టియిస్తే వెయ్యిరూపాయలు బహుమతియిస్తానని వాగ్దానంచేశాడు.

వెయ్యిరూపాయలంటే ఎవరికి ఆశ కలగదు? ఆ వాగ్దానం విన్నవాళ్ళందరూ



పనికట్టుకుని ఆ పక్షికోసం నానాతంటాలూ పడ్డారు. ఆ తోటలేకాదు, చుట్టుప్రక్కల వున్న అడవుల్నికూడా గాలించారు. ఊహుఁ! అది పట్టుబడటంమాట అటుంచి, వాళ్ళ కంటనైనా పడలేదు.

మానవునకు పనిలో పట్టుదల అనేది ఉన్నపక్షమందు, ఏనాటికైనా సాధించితీర గలుగుతాడు. అందుకుతోడు, అతనికి తెలివి తేటలు, యుక్తి, ప్రావీణ్యత ఉన్నట్టయితే ఇక చెప్పేదేమిటి?

గురవయ్యశెట్టివద్దనుండే తోటమాలి పట్టుదలా ప్రావీణ్యమూ–రెండులక్షణాలూ ఉన్నవాడు. ఒకనాటి ఉదయం ఉచ్చులు వొడ్డి ఆ బంగారుపక్షిని చేజిక్కించుకో గలిగాడంటే, ఆశ్చర్యం దేనికి?

తన తోటమాలి పట్టితెచ్చిన ఆ పిట్టను చూడగానే శెట్టి ఆనందానికి మేరలేక పోయింది. బంగారు పంజరంలో ఆ బంగారు పక్షినిపెట్టి, మునుపు అది ఏ మామిడిచెట్టు కొమ్మమీదినించి పాడేదో దానికే వ్రేలాడ తీయించాడు.

మరునాడు తన ప్రాణమిత్రులైన ముగ్గురు పెద్దమనుష్యుల్ని ఆహ్వానించాడు. ఆ బంగారుపక్షి గానంవిని, గొంతులోనుంచి వెలువడే బంగారు శకలాన్ని చూడగలగటం గొప్ప అదృష్టంగా వారు భావించారు.

ఇప్పుడే పాడుతుందో, అప్పుడే పాడు తుందో అని, ఆ పక్షి గొంతునుండి వెలు పడే అపూర్వ గానంకోసం వారు సూర్యో దయంనుంచి సూర్యాస్తమయంవరకూ కూర్చున్నారు. ఆ పక్షి గొంతెత్తి పాడలేదు సరిగదా, రెక్కలైనా కదపలేదు.

ఈ అసందర్భం శెట్టికీ అర్థంకాలేదు. పంజరంలో వుండడం కొత్తగనక బహుశా భయపడివుంటుందని ఆ ముగ్గురు స్నేహితు లకూ క్షమాపణలు చెప్పుకున్నాడు. బంగారు పంజరంలో వుంటూ, కావలసిన పండ్లూ

ఫలాలూ, చల్లని జలం వెతుక్కోకుండా అందుబాటులో వుండడంకన్న ఏ పక్షికి మాత్రం మరేంసదుపాయం కావాలన్నాడు. 'రేపు ఉదయంవస్తే తప్పక ఆ అమృతగానం వినగల'రన్నాడు.

మరునాడు సూర్యోదయంతోనే స్నేహితులు ముగ్గురినీ వెంటబెట్టుకొని గురవయ్యశెట్టి పక్షివున్నచోటుకు వెళ్లాడు. ఆరోజు కూడా మధ్యాహ్నంవరకూ నలుగురూ ఎంతో ఆతృతతో వేచి కూర్చున్నారు. కాని పక్షి కంఠం కదిలించలేదు.

గురవయ్యశెట్టికి విసుగూ, కోపంకూడా కలిగినై. స్నేహితుల్లో ఒకరు అనలేక అనలేక "పాపం! ఆ పక్షికి ఏమియిబ్బందిగావున్నదో! ఇంతకూ అసలు అది జీవించే వున్నదా?" అన్నారు.

గురవయ్యశెట్టికి అరికాలి మంట నెత్తికెక్కింది. 'బంగారు పంజరంలో పెట్టామే, కావలసిన సదుపాయాలన్నీచేశామే? అటువంటప్పుడు పక్షి మరణిస్తుందా? ఏ పక్షికైనా, బంగారుపక్షికైతేమాత్రం, అంతకన్న కావలసింది ఏముంది?' అనుకొన్నాడు.

నౌకర్ను పిలిచి కొమ్మకు వేలాడుతూన్న పంజరాన్ని క్రిందకు దింపమన్నాడు. వాడు చెట్టెక్కి పంజరాన్ని తీసుకువచ్చి భయంభయంగా యజమానిముందు పెట్టాడు.

ఆత్రంతో శెట్టీ, అతని స్నేహితులూ, పంజరంచుట్టూ చేరారు. చూశారు. గుడ్లు మిటకరించారు. ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. 'ఆఁ! ఆఁ!' అనడం తప్ప ఒకళ్ల నోటినుంచీ ఒక్క మాటయినా వెలువడలేదు.

అనుమానంతీరక శెట్టి పంజరంమూత తెరిచి ఆ బంగారుపక్షిని చేతితో తాకి మరీ చూశాడు. అతడి శరీరం జలదరించింది. పాపం! ఆ బంగారుపక్షి చనిపోయి అప్పటికే రెండురోజులైపోయింది !!






## 5

బొాకుమీద పేరు చూచిందే మొదలు, శక్తిసింహుని మనస్తత్వమే మారిపోయింది. సోలిపోయిన అతనికి తెలివిరాగానే అందరనూ పొమ్మన్నాడు. బాకుతీశాడు. తిప్పి చూచాడు. ఆ పిడివంకా, పిడిమీది పేరు వంకా అదేపనిగా మళ్లీమళ్లీ చూడసాగాడు. చూస్తూవున్నప్పట్లో అతనివైఖరి బహు విధాలుగా మారుతూవచ్చింది.

"అరి దుర్మార్గుడా !— ఉన్నట్టేవుండి నా ప్రాణానికే తలపెట్టావా ? ఎటువంటి వ్యూహం పన్నావు? ఎంత పొందికగా కపట నాటకమాడావు ? ఎవళ్లదగ్గర వాళ్లమాటలు చెప్పి, ఎంత చక్కగా నమ్మించావు ? కానీ—నీ పాపం బద్దలయింది. అందుకనే నీ పన్నాగం బయటపెట్టింది ఈ బాకు" అంటూ తనలో తనే ప్రసంగం ప్రారంభించాడు.

అతనికి మనస్తిమితం కుదరలేదు. ఆలోచనలకు అంతులేదు. గభీమని లేచాడు. అటునుండి యిటు, యిటునుండి అటు విసురుగా పచారులుచేయసాగాడు. "ఇంతకూ, లోపం నాదేనని అనిపిస్తున్నది. ఏమీ అంటే—నాకు కుటుంబకష్టాలు ఎప్పుడైతే మొదలెట్టినయో అప్పటినుంచీ నేను గుడ్డిగా సాధువులను పూజించటానికి అలవాటుపడ్డాను. ప్రతివేషధారినీ నమ్మి, వాళ్లయెదట నా చరిత్ర వెల్లడిస్తూవచ్చాను. ఇదే నా కొంపముంచింది. ఈ లోకువ కనిపెట్టే వాడు ఇంతటి దురంతానికి తలపడ్డాడు. లేకుంటే—సింహస్వప్నంకదా, నేనంటే వాడికి ! నాపట్లే కుట్రచేయటానికి సాహసించాడే !" అని మళ్ళీ తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు.




ఆనాటి సంఘటన తలపునకు వస్తేసరి, దిగాలుపడుతూ "నా యింగితమంతా ఏ యేట్లోపడింది? వాడు తక్కిన సాధువులందరిలా కనిపించటంలేదన్నప్పుడైనా కానుకోలేకపోయానే! అయ్యో, వాడిని దేవుడిలాగా నమ్మి, నా హృదయమే ఇచ్చివేశానే!' అనుకొని జిజ్ఞాస చెందాడు.

ఆ వెంటనే మళ్ళీ ధైర్యంతెచ్చుకుని, "దేవుడు పూర్తిగా నాపట్ల ఉన్నాడనటానికి ఇంతకంటె నిదర్శనం ఏంకావాలి? వాడికి ఈ దుర్బుద్ధి పుట్టడం, అదీ ఒక మంచికే వచ్చింది. ప్రాణం దక్కిందే చాలునని వాడు పరుగుచ్చుకున్నాడు. మరి ఈ జన్మలో మళ్ళీ ముఖం చూపుతాడనటం వట్టిమాట. అందుచేత, నా పాచిక పారటానికి మరీ బాగా సావకాశం చిక్కింది" అనుకుని, ఏదో ఒక గొప్పసమస్య తీరినట్టుగా సంతోషించాడు.

మరునాడే శక్తిసింహుడు దర్బారుపెట్టి ముఖ్యులందరినీ పిలిపించాడు. 'ఒక్కసారి మనం వెనకటిరోజులు జ్ఞాపకం చేసుకోవాలి. ఇందుకోసమే మిమ్మల్ని శ్రమపెట్టి రప్పించాను. అక్కా, బావా, పసివాడూ పోవటం కేవలమూ విధివైపరీత్యమనుకుని సరిపెట్టుకున్నాము. ఒకవేళ మధ్యని వచ్చిన ఆ వృద్ధురాలు కారకురాలై వుంటుందేమోననికూడా శంకించాము. చివరకు, ఏమీచేయలేక, లోకంనోరు కట్టటానికని పాపం, మహానుభావుడైన ఈ ఆస్థాన వైద్యుణ్ణీ, లోకజ్ఞానంలేని ఈ దాదినీ అనుమానించి, బంధించి, పాపానికి ఒడిగట్టుకున్నాము, ఐతే, ఇప్పుడు నిజం బయల్పడింది. తరతరాలుగా మా రాజవంశాన్ని కనిపెట్టుకుని ఉన్నవాడూ, నమ్మిన బంటులాగా నడుచుకొంటున్నవాడూ, వాడే ఇటువంటి ఘాతుకానికి పూనుకొన్నాడు' అంటూ వుండగానే, సభలో ఉద్రేకం బయల్దేరింది.



"ఎవడా దుర్మార్గుడు? ఎవడా పయోముఖ విషకుంభం?" అని కేకలువేశారు.

"చెప్పనివ్వండి మరి. తొందరపడకండి. నిన్నను మన కోటలో జరిగిన చిత్రకథ చెప్పటానికే మిమ్మల్ని రమ్మని కోరింది. అంతా విన్నాక మీకే తెలుస్తుంది..." అంటూ, మంత్రి తనను హత్యచేయ వచ్చాడని ప్రజలు నమ్మేటట్టుగా మాయ సాధువు చరిత్ర అంతా విప్పిచెప్పాడు.

"ఆ నీచుడెవడో పేరుచెప్పండి. వాణ్ణి చీల్చి చెండాడితేగాని ఇంటికి పోయేదిలేదు" అని గగ్గోలుచేస్తూ, అందరూ శక్తిసింహుని దగ్గరగా చేరుకున్నారు. అప్పుడు శక్తిసింహుడు తనవద్దనున్న బాకుతీసి పెద్దల చేతికిచ్చాడు. దానిమీద పేరు చూచి అందరూ విస్తుపోయారు. "మంత్రికే పుట్టిందా దుర్బుద్ధి! ద్రోహి!! స్వామిద్రోహి!!!" అంటూ జనం కారాలూ మిరియాలూ నూరారు. 'వాడిని పట్టిపల్లార్చాలి' అని కొంతమంది ఉగ్రంగా దీక్షపట్టారు. 'ఇంకా నయం, మన ప్రభువు అదృష్టవంతుడు!' అంటూ మరికొంతమంది ఊరటచెందారు. కొందరు మంత్రిని పట్టటానికని ఆవెంటనే బయల్దేరారు.

"సరే. వెళ్ళనివ్వండి వాళ్ళను. వాళ్ళే కాదు, మనందరమూ వెళ్లాలిసివుంటుంది. ఒక రాజద్రోహి జీవించివుండగా మనకు ఎలా నిద్రపట్టుతుంది? శత్రుశేషం ఉండకూడదంటారు పెద్దలు. కనుక మన పరమశత్రువునుపట్టి చిత్రవధ చేస్తేకాని మరొక పనికి పోకూడదు" అని పురెక్కించాడు, శక్తిసింహుడు.

"అంతేకాదు. ఇంతటినించీ మన రాజ్యంలో ఏ కొత్తపురుగు ప్రవేశించినా, కట్టుదిట్టంగా పరీక్షచేయాలి. పరీక్షకు నిలిస్తేగాని అడుగుపెట్టనీయకూడదు" అని శాసనంచేశాడు. మంత్రిని పట్టితెచ్చిన



వచ్చింది. ఐతే—ఇప్పటికైనా పొరపాటు గుర్తించగలిగాము కాబట్టి, తప్పు దిద్దుకోవటానికి నాకుతోచిన ఒక సాధనం మీకు విన్నవిస్తున్నాను" అన్నాడు శక్తిసింహుడు.

ఒక్క నిమిషం ఆగి, ఆస్థానవైద్యుణ్ణి రెండుచేతులూ పట్టుకొని తీసుకొనివెళ్ళి తనస్థానంలో కూర్చోబెట్టాడు. సభవంక తిరిగి, "ఇదుగో, మీ అనుమతితో ఈక్షణం నించీ ఈయననే మన రాజ్యానికి సారథిగా చేస్తున్నాను. పరోక్షంగా ఉన్నప్పటికీ నేను మీసేవచేస్తూ నేవుంటాను" అనే సరికల్లా, శక్తిసింహుని త్యాగానికీ ఔదార్యానికీ అందరూ జేజేలుకొట్టారు.

వాళ్లకు మంచి మంచి బహుమతులు ఇస్తామంటూ రాజ్యమంతటా చాటింపులుకూడా వేయించాడు.

"ఇప్పుడు మరొక్క ముఖ్యవిషయం చెప్పి ఇవాళకు దర్బారు చాలిస్తాము. ఈ ఆస్థానవైద్యుడు మనందరకూ తండ్రివంటి వాడు, గురుతుల్యుడు, గొప్ప అనుభవజ్ఞుడు. పైగా స్వామిభక్తిపరాయణుడు. ఇటువంటి మహానుభావుణ్ణి అనుమానించి బంధించాడు ఆ పరమ దుర్మార్గుడు! వాడిమాట కాదనటానికి అప్పట్లో నాకు తగినంతబలము లేక పోయింది. నిరపరాధులకు తీరని అపచారం జరుగుతున్నప్పటికీ చూస్తూ ఊరుకోవలసి

అయితే—ఆస్థానవైద్యుడు సందిగ్ధంలో పడ్డాడు. మంత్రిని ఆయన చిన్నప్పటి నుంచీ ఎరుగును. అతడు ద్రోహం తలపెడతాడనేది నమ్మరానిమాట. ఏ పరిస్థితుల్లో అతడిలా చేసివుంటాడో సంగతీ సందర్భం తెలియందీ ఏమనుకోవటానికీ వీలులేదు. ఏది ఎలావున్నా మంత్రిపట్ల ఆయన నమ్మిక, అభిమానమూ కొంచెమైనా సడలలేదు. నిజానిజాలు బయల్పడాలంటే మంత్రి తిరిగిరావటం చాలా అగత్యం. ఉద్దేశం ఏదైతేనేమి, ఇప్పుడు శక్తిసింహుడు

చేస్తున్న ప్రయత్నమంతా మంత్రిని తిరుగా రప్పించటానికే. అటువంటప్పుడు తన కిచ్చిన గౌరవం ఎందుకు నిలబెట్టుకోక పోవాలి?—బాగా ఆలోచించి, మారు మాటాడక అంగీకారం తెలిపాడు. ఆస్థాన వైద్యుడు గద్దె ఎక్కటం అందరకూ సంతోషం కలిగించింది.

* * *

అనాడు పారిపోయిన మంత్రిమాత్రం సామాన్యుడా! అంతంతమాత్రాన పట్టుబడి పోయే తెలివితక్కువవాడా! నిజానికి, అతడు అన్నింటికీ సిద్ధపడే వచ్చినప్పటికీ, ఇలా జరుగుతుందని కలలోనూ తలచ లేదు. అతడు కుశాగ్రబుద్ధి. తీరా పట్టుబడే పరిస్థితి ఏర్పడిందాయె! బ్రతికివుంటే, ఎన్ని శ్రమలైనాపడి తనకోరిక సాధించ టానికి వీలవుతుందిగాని, పట్టుబడిపోతే ఇంకేముంది! శక్తిసింహుని దుర్నయమూ, తన నిష్కాపట్యమూ లోకానికి వెల్లడిం చాలి! అందుకోసమే బాకు జారిపోయిం దనగానే వెనుకచూపు లేకండా, మెరపు మెరసినట్టుగా మాయమయ్యాడు!

శరవేగ వాయువేగ మనోవేగాలతో నరుడికంటపడని కారడవులలో దూరి



పోయాడు. శక్తిసింహుని అశ్వికులు చేయ గల ప్రయత్నాలన్నీ చేసి, విసిగి వేసారి, నిస్పృహతో మరలిపోయారు.

ఎన్నెన్నో కష్టాలుపడి, రాత్రీ పగలూ ఏకబిగిని రెండురోజులు ప్రయాణం చేయగా, మంత్రికి అల్లంతలో ఒక పర్వత శ్రేణి కనిపించింది. దానిని చేరుకుందా మనుకొన్నాడు. కాని, అలసి సొలసివున్న ప్రాణి కావటంచేత, దారిలోనే గుర్రంమీది నించి పడిపోయాడు.

పడిపోయిన ప్రాణికి ఆ నిర్జనారణ్యంలో దిక్కెవరు, మొక్కెవరు? కొంతసేపటి కల్లా తనంతట తనకే తెలివివచ్చింది.



బడలిక తీర్చుకొందామనుకున్నంతలో విమానంమోతలాంటి ఒకధ్వని వినిపించింది. చెవులు రిక్కించి, ఆ ధ్వనివచ్చిన దిక్కుకు చూచాడు. అది ఒక దొప్పవంటి చిత్రమైన అకారం! ఆకాశమార్గాన ఎగిరిపోతున్న ఆ దొప్ప కొద్దిసేపటిలోనే అగపడకుండా పోయింది.

'ఇదియేమిటి? ఎందుకు ఎగురుతున్నది? ఎలా మాయమయింది?' అని ఈవిధంగా మంత్రి బుర్రలో లక్షప్రశ్నలు పుట్టినై. అంతులేని కష్టాలకు ఓర్చి, ఐదురోజులయేసరికి బ్రహ్మాండమైన ఆ పర్వతశ్రేణి అవతలిభాగం చేరుకోగలిగాడు.

అడంతా మరొక ప్రపంచంలాగా కనిపించింది. అనాడు కనబడిన ఆ మాయదొప్ప ఎప్పుడు మళ్ళీ కనిపిస్తుంది, అదిచేసే మధురధ్వని మళ్ళీ ఎప్పుడు వినిపిస్తుంది? అని ఆత్రంతో కనిపెట్టుకునివున్న మంత్రికి అది కనబడలేదుకాని, అంతకుమించిన మరివకవింత అతని దృష్టిని ఆకర్షించింది.

కనుచూపుమేరలో ఆకాశాన్నీ భూమండలాన్నీ కలిపే ఒక రాట అగుపించింది. 'మనవాళ్ళు కథలలో చెబుతూవుంటారు, భూమినుండి స్వర్గానికి సరాసరి దారి వున్నదని. ఆదేనా యిది? ఐతే సన్నటి రాటలాగా వున్నదే యిది, దీనికి మెట్లెక్కడ?' అని అనుకొంటూ గుర్రం ఎక్కాడు. సగం దూరం వచ్చేసరికి రెండురోజులు పట్టింది. అప్పటికి ఆ రాటవంటిది మరికొంచెం లావుగా, స్పష్టంగా కనపడి, అది ఒక స్తంభమైవుంటుందని తోచింది.

మరి రెండురోజులు శ్రమపడి ఆ చేరువకు సమీపించాడు. పరిశీలించిచూడగా, తను అనుకొన్నట్టు అది రాటా కాదు, స్తంభమూ కాదు. ఒక అపూర్వమైనభవనం!

ఆ అద్భుతభవనం చూచీ చూడగానే 'ఇది మానవమాత్రులు నిర్మించిందేనా!

నిర్మించటానికి సాధ్యమవుతుందా ?' అని మంత్రి ఆశ్చర్యంపొందాడు. అది దీప స్తంభంలాగా గుండ్రగా ఆకాశాన్ని అంటుతూ వున్నది. పైకి పోనుపోను విశాలమైవుంది. దాని కొట్టకొసని చిత్రమైన గుమ్మటం ఒకటి దాని అందాన్ని రెట్టించుతున్నది. భవనానికి పేర్చిన ఒక్కొక ఇటుక బంగారుమలామా చేసినట్టుండి, తళతళమెరుస్తూ, కన్నులు మిరుమిట్లు కొల్పుతున్నై. ఆ భవనపు అందచందాలనూ విడ్డూరాలనూ చూస్తూ అలా నిశ్చేష్టుడై నిలబడేసరికి, దిగువను ఒకచోట నలుచదరంగా ఓటలుకనుపించినై.

అక్కడకు వెళ్ళి ఆ భాగం కదిపి చూచాడు. నిజానికి అది ఒక మరతలుపు. అతడు కదపగానే లోపలకు దారిచ్చింది. అతడు లోపల ప్రవేశించినవెంటనే మళ్ళీ ఎప్పటిలాగా మూసుకుపోయింది. నాలు గడుగులు వేశాడోలేదో, మనిషి పట్టేటంతటి ఒక బోనువంటి పెట్టె కనబడింది. దానికి ఒకవైపున ద్వారమున్నది. అందులో అతడు అడుగుపెట్టగానే అది రంయ్‌మంటూ అతనిని పైకంటా తీసుకపోయి, ఆగింది. మహిమగల ఈ వింతకు అబ్బురపడుతూ, మంత్రి ఆ బోనుదిగి, అలా అలా పోసాగాడు.




అవన్నీ విశాలమైన గదులు: ఒక గదిలో చిన్నప్పుడు రాజకుమారులకు పనికివచ్చే రకరకాల ఆటవస్తువులున్నాయి. ఒకగదిలో అద్దాల బీరువాలూ, వాటినిండా రాచబిడ్డలు ధరించే దుస్తులూ ఉన్నాయి. ఇంకొక గదిలో చక్కటి బొమ్మలపుస్తకాలు! ఆ పుస్తకాలలోని పత్రాలు తిరగవేస్తే లోకంలో జరిగే చర్యలన్నీ తెలుసుకోవచ్చు. అటు దేవలోకంలోనూ, ఇటు నాగలోకంలోనూ జరిగే వింతలుకూడా అగపడతై.

ఇటువంటి చిత్రవిచిత్రాలైన గదులన్నీ చూడటం పూర్తికాగానే, చిట్టచివర అతడు ఒక పెద్ద ద్వారంవద్దకు చేరుకున్నాడు.

అది తెరిచేటప్పటికి నందనవనంలాటి పువ్వులతోటలోకి దారిచూపింది. ఆ పువ్వుల సౌందర్యమూ, పరిమళమూ అతన్ని పరవశుణ్ణి చేసినై. కొంచెంసేపు ఆ పరిమళాలు ఆఘ్రాణించి, ఇంకా ముందుకు వెళ్ళాడు. వెళ్ళగా ఇంకొకద్వారం తగిలింది. అది అపురూపమైన ఫలజాతులుగల ఒక తోటకుదారి చూపింది. మంత్రి విస్మయం చెప్పతరం కాదు. తినగలిగినన్ని ఫలాలు తిన్నాడు. కనివిని ఎరుగని ఆ ఫలజాతులు ఒక్కొక్కటే చవిచూస్తూ ఇంకా సాగిపోయేసరికి, మరొక ద్వారం కనిపించింది. అది తెరవగా, రాచ కుటుంబీకులు జలకమాడే కోనేరు నిర్మలమైన జలంతో నిండి కనుపండువచేస్తున్నది. కోనేరుపక్కనే ఒక గచ్చుచేసిన చెరువున్నది. దానినిండా వేడినీళ్ళు ఉన్నాయి. స్నానంచేయటానికని ఏర్పాటైన ఆ పరికరాలు, పద్ధతులు, సౌకర్యాలూ అతడు జన్మలో చూచి ఎరుగడు.

ఇంత ప్రదేశం తిరిగినప్పటికీ ఎవరుకాని వచ్చి అతనిని ఏమీ ప్రశ్నించలేదు. అందుచేత, సాహసించి పరిశుభ్రంగా కోనేటిలో స్నానంచేసుకున్నాడు.

అటుతరువాత మరికొంతదూరం సాగిపోగా, ఒక పెద్దహాలు అగుపించింది. అదంతా పాలరాళ్లతో చపటాచేసి వుండటంచేత, అద్దంలోమోస్తరుగా నీడ కనపడుతూ వుంది. అక్కడ మెత్తటి దిండు అమర్చిన ఒక కుర్చీలో కూర్చున్నాడు. అప్పుడు అతనికి అనేకమైన ఆలోచనలు పోయినై: 'ఇంతకుముందు విన్నటువంటి ఆ మధుర ధ్వని ఏమిటి? దొప్పవంటి దాని ఆకారం యేమిటి? చిత్రమైన ఈ భవనమేమిటి? రాజభోగ్యములైన ఈ సదుపాయాలన్నీ ఏమిటి? ఇంత బ్రహ్మాండమైన భవనంలో ఒక్కపురుగైనా సంచరించకపోవడమేమిటి?—' అని అనేకవిధాల జిజ్ఞాసపడ సాగాడు.

—(ఇంకా వుంది)



# దీనజనకల్పద్రుమం





సులైమాన్ ఒక గొప్ప మహమ్మదీయ చక్రవర్తి. ఆయన మంత్రి జాఫర్. జాఫర్ చాలా యోగ్యుడూ తెలివైనవాడూను. అతడు పేదవాళ్లపాలిటి పెన్నిధి. వాళ్ళకు కష్టాలువస్తే అతడు సహించలేకపోయేవాడు. ధనవంతులమీద పన్నులు వేసి సొమ్ము రాబట్టి, ఆ సొమ్మంతా పేదవాళ్ల కూడుగుడ్డల నిమిత్తం ఖర్చుపెట్టేవాడు. సామ్రాజ్యంలోని దీనజనులందరికీ జాఫరు ఈవిధంగా తోడ్పడటంవల్లనే ఆయనకి 'దీనజన కల్పద్రుమం' అనే బిరుదు వచ్చింది.

పేదవాళ్లందరికీ జాఫరంటే ప్రేమా, గౌరవం ఎక్కువ. ధనవంతులందరికీ ఆయన మీద అంతులేని అయిష్టం, ద్వేషమున్నూ. జాఫరుమూలాన్ని భూస్వాములు ఇంకా ఎక్కువగా భూములూ పుట్రలూ సంపాదించటానికి వీలుచిక్కిందికాదు. వర్తకులకు ఇంకా ఎక్కువగా లాభాలు సంపాదించటానికి వీల్లేకపోయింది. ఈ ధనికులు సంపాదించినదాంట్లో చాలామట్టుకు జాఫరు విధించిన పన్నులద్వారా చక్రవర్తి బొక్కసంలోకి చేరిపోతూవచ్చింది. అక్రమంగా సంపాదించే వాళ్లందరినీ జాఫరు వేయి కళ్లతో కనిపెట్టి శిక్షించేవాడు. ఉద్యోగస్థులందరికీకూడా అతడంటే హడలే. లంచగొండ్లనీ, అధికార దుర్వినియోగం చేసే వాళ్లనీ పట్టి అతడు ఏమాత్రం దయాదాక్షిణ్యమూ లేకుండా దండించేవాడు.

జాఫరును ఎలాగైనా వదిలించుకోవాలని ధనవంతులంతా చేరి అతనిమీద కుట్ర చేశారు. జాఫరు లేనిసమయాల్లో చక్రవర్తి వద్దకుపోయి, చాడీలు చెప్పేవారు. క్రమంగా చెప్పుడుమాటలు చక్రవర్తి తలకెక్కి మంత్రిపైన లేని పోని అనుమానాలు బయల్దేరి వృద్ధిపొందసాగినై.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు




ఒకనాడు జాఫరు శత్రువులు చక్రవర్తితో, "ప్రభూ! మన మంత్రిగారు పన్నుల క్రింద కోట్లకొలది రొక్కం వసూలుచేశారే. ఈ రొక్కమంతా ప్రభువుల బొక్కసంలోకి చేరుతున్నదో మంత్రిగారి సొంత భోషాణాలలోకే పోతున్నదో ఏలిక కనిపెట్టారా!" అన్నారు.

వెంటనే చక్రవర్తి ఖజానా తెరిపించి చూశాడు. అందులో ఉండవలసినంత రొక్కం కనబడలేదు. ఎలావుంటుంది నిలవ? ఎప్పుడువచ్చిన సొమ్ము అప్పుడే బీదలకోసం ఖర్చుపెట్టేస్తూవచ్చాడాయె జాఫరు. ఎన్నడైనా చక్రవర్తి జమాఖర్చులు చూస్తేగా?

తన సొమ్మంతా మంత్రి అపహరించాడనే అపోహతో వళ్లుతెలియని కోపం కమ్ముకువచ్చింది చక్రవర్తికి. మారు ఆలోచనలేకుండా, 'జాఫర్ని ఉరితీసివేయండి. వాడి మొహం మరెన్నడూ నాకు కనపడనివ్వకండి! మరెవ్వడూ ఇలాంటి రాజద్రోహం తలపెట్టకుండా హడలుపుట్టేటట్లు చేయాలి. అందుకని జాఫరు శవాన్ని పాతిపెట్టకుండా తీసుకుపోయి నాలుగు రహదారీలు కలిసేచోట పడేసి, భటుల్ని కాపలా ఉంచండి! రాజద్రోహుల శవాలను కాకులూ గద్దలూ పొడుచుకు తినేట్లు చేయండి. వాటికి సమాధికూడా జరగకూడదు" అని శాసించాడు.

జాఫరుపైన పగదీర్చుకోటానికని కనిపెట్టుకునివున్న ఆ దుర్మార్గులు వెంటనే పరుగెత్తివెళ్ళి, ఏపాపం ఎరుగక నిశ్చింతగా నిద్రపోతూన్న జాఫర్ని బంధించి తీసుకుపోయి, చక్రవర్తి ఆజ్ఞను అక్షరాలా జరిపించి, ఆ మహాత్ముని శవాన్ని మార్గసంధిలో పడేసి చక్కావచ్చారు.

రాజాజ్ఞ కావటంచేత జాఫరు బంధుమిత్రులుకూడా శవంవద్దిరకు వెళ్ళటానికి వీలులేకపోయింది.



అలీ అనే పేదవాడొకడు ఆదారినిపోతూ, ఈశవం ఫలానివానిదికదా అని గుర్తించాడు. ఆశ్చర్యంతో, ఆపుకొనలేని దుఃఖంతో 'ఇదేమిటి? ఈ మహానుభావునికేమిటి, ఇటువంటి గతి పట్టడమేమిటి' అంటూ ఆ శవంమీదపడి దుఃఖింప నారంభించాడు.

రక్షకభటులు ఆ పేదవానికి సంగతంతా వివరంగా చెప్పి, "నువ్వు వెంటనే ఇక్కడనుంచి పోకపోతే నీకూ ఈ దురవస్థే ప్రాప్తమౌతుంది! కనుక నీదారిన నీవుపో" అని బెదిరించారు.

అలీ అప్పుడు "ఈ సామ్రాజ్యంలో పేదవాళ్లపాలిటి కల్పవృక్షం, పుణ్యాత్ముడైన ఈ జాఫరు! ఈయన చావడమేమిటి ఇంత అకస్మాత్తుగా? ఇది జాఫరు చావుకాదు. పేదవాళ్ళమైన మేమంతా చచ్చిపోయినట్లే! ఇంతవరకు వచ్చినతరువాత నాకు చక్రవర్తి భయమేమిటి, మృత్యువు భయమేమిటి? ఈ మహాత్ముని పవిత్రదేహాన్ని తీసుకుపోయి సమాధిచేసివస్తాను. ఆపైన నన్ను మీయిష్టంవచ్చినట్లు చేసుకోండి!" అంటూ పరవశత్వంతో జాఫరు శవాన్ని బుజంపైన వేసుకునిపోయాడు.

రక్షకభటులు అడ్డువచ్చి శవాన్ని తీసుకోనిచ్చారుకారు. అలీని లాక్కుపోయి చక్రవర్తి సమక్షంలో పెట్టి, జరిగినదంతా చెప్పేరు.

చక్రవర్తి కోపానికి హద్దులేకుండాపోయింది. ఆయన కళ్లవెంట నిప్పులు కక్కుతూ 'మూర్ఖుడా. నా ఆజ్ఞను తిరస్కరిస్తావు? ఎన్ని గుండెలు' అని గద్దించాడు.

తొణుకూ బెణుకూ లేకుండా, అలీ "ప్రభూ, జాఫరు దీనజనకల్పద్రుమం! నీ ఖజానాలోని సొమ్ములో ఒక్క దమ్మిడీ కూడా అతడు తనకై కర్చుపెట్టుకొని యెరుగడు. నావంటి దరిద్రకోటి ఆయనని

యేవిధంగా పోషిస్తున్నదీ, లెక్కలు చూడండి, మీకేబోధపడుతుంది. ఈ మహాత్ముణ్ణి, చంపుకోవటం! అంతటితోనైనా అగక, పైగా ఆయన శవాన్నికూడా అవమానించడమా!' అన్నాడు.

ఎప్పుడైతే ఆలీ నోటినుండి ఈమాటలు విన్నాడో, 'నేను నిర్దోషిని చంపించలేదు కదా!' అన్న కలవరం బయల్దేరింది చక్రవర్తి హృదయంలో.

ప్రక్కనున్న జాఫరు మిత్రుడు, "ప్రభూ! - లెక్కలు చూడగా మంత్రి విషయంలో వీడుచెప్పినమాట నిజమే అన్నట్టుంది" అన్నాడు.

చక్రవర్తి తన అపరాధాన్ని గుర్తించాడు. ఆలీవంకకు తిరిగి 'జాఫరు ఏదో మహా గొప్పవాడని ప్రశంసిస్తున్నావే! మీకు అందరికీ వాడు పంచిపెట్టేడబ్బు మాదేకదా? నేను నీ దరిద్రమంతా తీరేటట్లుగా బోలెడు సొమ్ము ఇప్పిస్తాను. పట్టుకుపో! ఇంక జాఫరుమాట తలపెట్టక అతణ్ణి మరిచిపో. ఇంతట్నుంచీ నీవు పొగడవలసింది సులేమాన్ చక్రవర్తినిసుమా!' అంటూ వెయ్యి వరహాలు తెప్పించాడు.

మరుక్షణంలో వెయ్యి బంగారు నాణేలు ఆలీముందు మెరిసినై. అతడి కళ్ళు జిగేలు మన్నాయి.

చక్రవర్తి ఆలీతో 'ఇవన్నీ నీవే, తీసుకో!' అన్నాడు.

ఆలీ రెండుచేతులూ ఆకాశంవైపు చాపి, 'జాఫర్ మహాశయా, నీవు నిజంగా దీనజన కల్పద్రుమానివే! బ్రతికివున్నప్పుడే కాదు, చచ్చికూడా నువ్వు నన్ను మరిచిపోలేదు. నిన్ను మాకు దూరంచేసిన ఈ ప్రభువుచేతనే నాకు వెయ్యి మొహిరీలు ఇప్పిస్తున్నావు!" అంటూ అప్రయత్నంగా జాఫర్ని పొగడటం మొదలెట్టేడు.

పట్టరాని దుఃఖంతో చక్రవర్తి, తల వాల్చుకున్నాడు.






వైరాగి వేమన్న ఒక గుడిమండపంలో కూచుని ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండే వాడు. ఆ ఊళ్ళో ఉన్న పిల్లలు కొందరు ఆయనచుట్టూ చేరి, ఏదైనా కథ చెప్ప మంటూ వేపుకొని తినేవారు. వాళ్లు అడిగిన ప్పుడల్లా విసుక్కోకుండా ఆయన ఏదో ఒక కథ చెబుతూనే ఉండేవాడు. ఒకనాడు వాళ్ళు మామూలు ప్రకారం వచ్చి కథ అడిగేసరికి ఆయన ఇలా ప్రారంభించాడు:

"పూర్వం అజాత శత్రువు అనే ఒక రాజు ఉండేవాడు. ఆయన చాలా మంచి వాడు. ఆయనకి ఎవరిమీదా కోపంగాని పగగాని ఉండేది కాదు. అవసరం ఐనప్పుడు మాత్రం లేనికోపం తెచ్చుకుని కోప్పడవల సినవాళ్ళని దండిస్తూ ఉండేవాడు. అంతే.

అజాతశత్రువు ఒకనాడు కొలువు తీర్చి ఉండగా చారులు కంగారుగా వచ్చి, 'ప్రభూ, కొంప మునిగింది!' అన్నారు.

రాజు నిదానంతో 'సంగతేమిటో చెప్పండి' అన్నాడు.

'మనకోట ముట్టడించటానికని కళింగ రాజు సేన వెంటబెట్టుకుని వస్తున్నాడు' అన్నారు చారులు.

అజాతశత్రువు తన సేనాధిపతివైపు తిరిగి, 'అలైతే యింకా ఆలస్యందేనికి? మన సేననుకూడా సిద్ధంచెయ్యండి. నేనూ ఇంతలో వస్తాను. శత్రువుల్ని సంహరిద్దాం' అని చెప్పి, వెంటనే కొలువు చాలించి వెళ్ళేడు.

మరొక్క క్షణానికి రణభేరీమ్రోత వినపడింది. శాంతంగా ఉన్న వాతావరణ మంతా ఒక్కమాటుగా మారిపోయింది. సైనికులంతా ఎక్కడి పనులక్కడ వదిలేసి, ఆయుధాలకోసం పరుగెత్తేరు. కవచాలూ ఆయుధాలూ ధరించి కోటముందు హాజ రయారు.

డి. సుబ్రహ్మణ్యం, తెనాలి



మరో క్షణానికల్లా ఆయుధపాణిఐన చక్రవర్తి గుఱ్ఱంమీదవచ్చి, అపారమైన తన సేనముందు నిలిచాడు. కొన్ని క్షణాల క్రితం కొలువులో గద్దెపై దర్శనమిచ్చిన ఆ శాంతమూర్తేనా! ఈ మహరాజులో ఇంత మార్పు చూడగలమని ఎవళ్ళూ నమ్మలేక పోయారు. భయంకరమూర్తి! దండనాయకుల్నీ సేననూ వెంటబెట్టుకుని, ఆకాత్తుగా వచ్చి పడుతున్న శత్రుసేనల్ని రాజు ఢీకొన్నాడు.

రాజు పరాక్రమం చూసేసరికి సేనలకు ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకొచ్చింది. జయజయధ్వానాలు చేస్తో ఆయన్ని అనుసరించి వెళ్లి శత్రువులను చెండాడ నారంభించారు. కళింగరాజు సేన క్షణంలో చెల్లాచెదరై పోయింది.

అకస్మాత్తుగా మీదపడి కోట వశం చేసుకోవాలనీ, అజాతశత్రువుని ఖైదీగా చేసి తీసుకుపోవాలనీ వ్యూహంపన్ని వచ్చిన కళింగరాజుకి, కథ అడ్డంతిరిగిందనీ అపజయం నిశ్చమనీ అని తేలిపోయింది. ఇంక అక్కడుంటే ప్రాణం దక్కదనిపించి, రణరంగంనుంచి పారిపోవటానికి అతడు వెంటనే తన గుఱ్ఱాన్ని వెనక్కి తిప్పేశాడు. కాని అజాతశత్రువు సేనాధిపతి కళింగరాజును వెంటాడి పట్టి రెక్కలు విరిచికట్టి తెచ్చి తన ప్రభువుముందు నిలబెట్టేడు.

కళింగరాజు ఉత్త దుర్మార్గుడు. అతడు సరిహద్దులోని అజాతశత్రువు రాజ్యంలో ప్రజలకి ఇదివరకు ఎన్నో ఉపద్రవాలు కలుగచేశాడు. అర్ధరాత్రివేళ నిద్రపోతూన్న ప్రజల్ని దోపిడీచేయించాడు. కనికరంలేకుండా స్త్రీలనీ, పిల్లలనీ, వృద్ధులనీ హత్యలు చేయించాడు. ఇలా తమల్ని పీడిస్తూన్న ఈ కళింగరాజుపైకి దండెత్తివెళ్లి, వీడి రాజ్యాన్ని వశంచేసుకోవలసిందని అజాతశత్రువుకి ప్రజలు ఎన్ని

మాట్లో మహజర్లు పెట్టుకున్నారు. కాని ఆయనకు యుద్ధమన్నా రక్తపాతమన్నా కిట్టదు. విపత్తురాకుండా బందోబస్తు చేశాడే గాని కళింగరాజ్యంమీదికి దండెత్తి వెళ్ళ లేదు. అందుచేత అజాతశత్రువు పిరికి వాడని తలచి ఇప్పుడు కళింగరాజు పేట్రేగి పోయాడు. రాజ్యాన్ని హరించాలన్న దుర్బుద్ధిపుట్టి ఇలా సేనతోవచ్చి పడ్డాడు.

అజాతశత్రువు ఏం, అసమర్థుడా! అనవసరంగా యుద్ధానికి దిగడమంటే ఇష్టంలేదుగాని తన సమర్ధత ఎటువంటిదో పనివచ్చింది గనుక కనపర్చాడు.




విరిచికట్టబడ్డ కళింగుడు దైన్యంగా రాజుముందు నిలబడి 'ఎంత పొరబాటు చేశాను! ఈయన మంచితనాన్ని పిరికితనం అనుకుని భ్రమపడ్డాను. గోతులోపడ్డాను!' అని విచారించాడు.

అజాతశత్రుని మంత్రులూ, దళాధిపతులూ తక్కినవాళ్ళూ, దీనావస్థలో ఉన్న కళింగరాజుని చూసి, 'ఇంక నేటితో వీడి పీడ మనకి వదిలిపోతుంది' అని ఎంతో సంతోషించారు.

'ప్రభూ, వీణ్ణి వెంటనే శిరచ్ఛేదం చేయించండి!' అన్నారు మంత్రులు.

'శిరచ్ఛేదంకంటే వీడికి చిత్రవధ తగిన శిక్ష!' అన్నారు దండనాయకులు.

కొందరు, 'అట్లాకాదు, వీడి కళ్లు రెండూ పెరికించేయండిప్రభూ' అన్నారు సైనికులు.

ఈ విధంగా అందరూ కళింగరాజు పైన పగను వెళ్లబుచ్చారు.

కళింగుడు ఆ మాటలు వినటంతోనే హడిలిపోయాడు. 'ప్రభూ, శరణు, శరణు. శిరచ్ఛేదం చేయించుగాని చిత్రవధ విధించబోకు!' అంటూ ఏడవటం మొదలు పెట్టేడు.

అప్పుడు అజాతశత్రువు సేనాధిపతితో 'ఇతణ్ణి వదిలెయ్యండి!' అన్నాడు.

"ఆ మాట వినేసరికి కళింగరాజుకే ఆశ్చర్యంవేసింది. సేనాధిపతి నిర్ఘాంత పోయి, 'ఏమిటి ప్రభూ, ఈ హంతకుణ్ణి వదిలెయ్యమని సెలవిస్తున్నారా!' విష సర్పాన్ని వెతికి పట్టుకొని చంపాలి! అలాంటప్పుడు చేజిక్కినవాణ్ని వదిలెయ్యా టమా ప్రభూ! వీడు మనకు ప్రక్కలో బల్లెం. మనమానాన్ని మనల్ని ఉండ నీయక మనమీదికి దండెత్తివచ్చిన పరమ శత్రువు! వీణ్ణా వదిలెయ్యటం!' అన్నాడు.

అందుకు అజాతశత్రువు, 'ఇతడు మన శత్రువన్న మాట నిజమే. అందుకనే యుద్ధంలో ఎదుర్కొన్నాము. కాని ఇప్పుడు మనల్ని శరణుజొచ్చి మిత్రుడయాడు. ఇంక శత్రుత్వ మెక్కడిది?' అంటూ, తన గుఱ్ఱాన్ని దిగి, కళింగరాజువద్దకు స్వయంగా నడిచివెళ్ళి, కట్లు విప్పేశాడు."

యోగి వేమన్న చెప్పిన ఈ కథ విని పిల్లలంతా, "అజాతశత్రువు ఎంత మంచి రాజో!" అని మెచ్చుకున్నారు.

"అయితే ఒక పద్యం చెబుతాను నేర్చు కోండి" అన్నాడు వేమన్న.

"చెప్పండి చెప్పండి" అన్నారు పిల్లలంతా ఆత్రంగా.

వేమన్న తడుముకోకుండా,

"చంపదగినయట్టి శత్రుండు తనచేత
 చిక్కెనేని కీడుసేయరాదు;
 పొసగమేలుచేసి పొమ్మనుటేచాలు
 విశ్వదాభిరామ, వినురవేమ"

అని పద్యం చెప్పేడు.

కథలోని అజాతశత్రువూ లేడు, పద్యం చెప్పిన వేమనయోగీ లేడు. ఆ కథా, ఈ పద్యం ఇవిమాత్రం మనకోసం ఇప్పటికీ నిలిచిపోయాయి.





# రంగు మారింది

ఒకానొక పేదవాడు కట్టెలకోసం అడవికి వెళ్ళాడు. కట్టెలుకొట్టుకొని. తిరిగి వస్తూ వుండగా ఒక టుప్పలో నల్లగా ఏదో కనిపించింది. ఆ వస్తువు నల్లగా వున్నప్పటికీ కాంతివంతంగా వుండటంచేత 'మనకెందుకులే, పోదా' మనుకున్నా, వాడు ఉత్తనే పోవటానికి మనస్కరించిందికాదు.

తీరా వెళ్ళిచూడగా, అది ఒక మానవ శిశువు!—నల్లగా వున్నప్పటికీ, ఆ నలుపులోనే ఒక అందం గోచరించింది. 'భేష్, ఇదేదో దైవమాయ!!' అని అనుకొని, కట్టెలవాడు ఆ శిశువును ఎంతో ఆప్యాయంగా ఇంటికి తీసుకపోయాడు. బిడ్డలులేని కారణంచేత వానిభార్య ఇది నిజంగా వరప్రసాదమే అని నమ్మి, ఎంతో మక్కువగా బిడ్డను పెంచుకోసాగింది.

నలుపు పోవాలనే ఆత్రంతో వాళ్ళు బిడ్డకు ఎన్నెన్నో ఓషధులతో నలుగుపెట్టి స్నానంచేయించారు. చిత్రమేమిటో, రోజురోజుకీ ఆ నలుపు మరింత యెక్కువగుతూవచ్చిందేకాని ఎంతకూ తగ్గనేలేదు. చివరకు, ఇదేదో శాపవశంవల్ల కలిగిన నలుపు ఐవుంటుందనీ, దీనిని పోగొట్టబూనటం వ్యర్థమనీ తలిదండ్రులు నిశ్చయించారు.

లోకంలో నల్లటివాళ్ళు చాలామంది వుంటారు. ఐతే, వాళ్లవల్ల ఒకళ్లకు బాధలేదు. ఈ బిడ్డడు అలాకాదు. తారుకంటె, మసిబొగ్గుకంటెకూడా కారునలుపుగా వుంటాడు. పైగా, వాడు యెక్కడ తాకితే అక్కడ వాడి నలుపు అంటుకుంటుంది. ఇది అందరకూ బాధగా వుండి, వాడిని ఎవళ్ళూ దగ్గర చేరనిచ్చేవారేకాదు. తోడివాళ్లంతా 'ఒరేయ్ నల్లోడా! దూరంగా పోరా!!' అంటూ ఈసడించుకునేవాళ్ళు.

నిజానికి బిడ్డడి నలుపు అంటుకుంటుందేమోననే భయంచేత తలిదండ్రులుకూడా

వి. జాలరత్నం - నల్లగొండ



వాడికి ఏపనీ చెప్పటం మానుకున్నారు. తలిదండ్రులే ఈవిధంగా భయపడేసరికి, పైవాళ్ళు వాడిని అలా చూడటంలో ఆశ్చర్యమేమున్నది?

తననుచూచి లోకమంతా అసహ్యించుకోవటం, తోడివాళ్లు గేలిచేయటం, ఇదంతా పెరిగి పెద్ద అవుతున్న 'నల్లోడి'కి కష్టమనిపించింది. 'ఛ!—ఎందుకు వచ్చిన బ్రతుకు' అనిచెప్పి చివరకు జీవితంమీద విరక్తికలిగి, ఒకనాడు వాడు ఎక్కడికైనా పోదామని బయల్దేరాడు. దారిలో నల్లోడికి ఒక శ్రీమంతుడూ ఆయనభార్యా ఎదురయ్యారు. గుర్రపుసారటుమీద పోతున్న ఆ దంపతులకు నల్లోడు నమస్కరించి, తనసంగతి వెల్లడించాడు.

ఆ శ్రీమంతుడు జాలిపడి, 'అబ్బాయీ, నల్లగా వున్నంతమాత్రాన ఏపనికీ పనికిరాక పోవడమేమిటి? నీ వయస్సు కుర్రవాడూ వ్యర్థంగా కాలంగడపడం బాగాలేదు. మా సారటు వెనకాల బల్లమీద నిలబడి 'ఫలానా వారు వస్తున్నారు తప్పుకోండి! తప్పుకోండి!!' అంటూ కేకలువేస్తూండు. ఘరానా మనుష్యులు వెళుతూవుంటే ఇలానే కేకలు వెయ్యాలి. ఈ పనికిగాను, నీకు తిండీ, గుడ్డా, నెలకు పదిరూపాయల జీతమూ ఇస్తాము. ఇలాచెయ్యటంవల్ల నీవు దూరాన ఉంటావు గనక నీరంగు మాకు అంటుతుందనే భయం వుండదు' అన్నాడు.

వెంటనే కొలువులో కుదురుకున్నాడు నల్లోడు. ఆ మట్టునే సారటు వెనకాల నిలబడి ఆ పెద్దమనిషి చెప్పినమోస్తరుగా కేకలువేయసాగాడు. ఇంతలో కర్మంచాలక ఆకస్మికంగా కారుమబ్బులు కమ్ముకు వచ్చి, గొప్పవర్షం కురిసింది. వర్షానికి నల్లోడి ఒంటిరంగు కరిగి, దంపతులు ధరించిన తెల్లటిబట్టలు పాడైపోయినై. శ్రీమంతుడికి చర్రుమని కోపంవచ్చింది. 'నీవు మా




కొలువులో ఉండనూవద్దు, ఏమీవద్దు, మా గుడ్డలన్నీ నాశనంచేశావు దౌర్భాగ్యుడా! పోపో' అంటూ వాడిని కసిరికొట్టాడు.

ఐతే, ఆయన భార్యమాత్రం వాడిపైన కోపగించలేదు. వాడిని ఇంటికి తీసుకపోయి ఒక తంబుర, ఒకచిన్న అద్దమూ చేతి కిచ్చింది. 'అబ్బాయీ!—ఈ తంబుర పాడు కొంటూ జీవనంచెయ్యి. ఇది మామూలు అన్ని తంబురలవంటిదీ కాదు. ఇది పాడ టానికి గురు శుశ్రూష అవసరంలేదు. దీని నుండి వెలువడే నాదంవల్ల మానవహృద యాలే పవిత్రములైపోతై. అటువంటప్పుడు శరీరానికి గల మాలిన్యం పోగొట్టడమనేది అంత పెద్దవిషయంకాదు. నీ అదృష్టం బాగావుంటే ఈ తంబుర ధర్మమా అని కర్మ పరిపక్వమై, నీ ఒంటినలుపు పోనూ పోవచ్చు' అనిచెప్పి దీవించి పంపింది.

సంతోషంతో నల్లోడు తంబుర పాడు కొంటూ దేశాటనంచేస్తున్నాడు. పోయి పోయి, ఒక రాజ్యంలో కాలుపెట్టేసరికి, అక్కడ ఒక పెద్దగుంపు కనిపించింది.

ఆ సందడి ఏమిటా అని వాడు భోగట్టా చేయగా—ఆదేశపు రాజకుమారికి స్వయం వరం జరుగుతున్నదట. ఆ రాజకుమారి ఒక విచిత్రమైనవ్యక్తి. పుట్టుకతోనే ఆమె శరీరం అపురూపమైన బంగారుఛాయతో మెరిసిపోతూ, ఆ కాంతి రోజు రోజుకూ ఎక్కువగుతూ వచ్చింది. ఆమెకు యుక్త వయస్సువచ్చి, స్వయంవరం చాటించే సరికి ఆమెవైపు ఎవళ్ళూ తేరిపార చూడలే నంతటి కాంతితో ప్రకాశింపసాగింది. అందు కోసమని అందరూ ఆమెను 'బంగారురాణి' అని పేరుపెట్టి పిలువసాగారు.

ఐతే—కాంతి ఎక్కువకావటంతోపాటు ఆమె మనసులోపట్టిన అతిశయంకూడా వృద్ధిపొందింది. ఎంతదూరాన్నుండి వచ్చిన ఎంత చక్కటి రాజకుమారుణ్ణయినా ఏదో




పంకపెట్టి హేళనచేసి సాగనంపుతూ వచ్చింది. ఆమెకు ఒక్కళ్ళూ నచ్చక పోయేసరికి, తలిదండ్రులకు ఏమీతోచక ఆలోచనలో పడ్డారు.

ఇంతలో–దేశాటనం చేసుకొంటూవచ్చి, ఈ నగరంలో కాలుపెట్టిన నల్లోడి తంబుర పాట దూరంనుంచి రాజకుమారికి శ్రావ్యంగా వినిపించింది. పాడిన ఆ పాట గాణ్ణి వెతికి పట్టుకరమ్మన్నది. తీసుకవచ్చి ఎదుటపెట్టారు. పాటయితే మధురంగానే వినబడిందికాని, తీరా మనిషిని కంటితో చూడగానే ఆమెకు చెప్పరాని రోత పుట్టుకొనివచ్చింది.

ఈ వింతమనిషి ఎవరా అని ఆమె వాని వివరాలన్నీ అడిగి తెలుసుకున్నది. అందుకు నల్లోడు 'నేను ఫలానా కారణంవల్ల విరక్తి చెంది దేశాటనంచేస్తున్నాను. ఐతే—నా నలుపు పోవటానికని ఒక యిల్లాలు మహిమ గల ఈ తంబురను నా కిచ్చింది. కనుక, త్వరలోనే నేను అందగాడిని కాబోతున్నాను. మరి, నన్ను పెళ్ళిచేసుకుంటావా?' అని అమాయికమైన హృదయంతో ఆమెను అడిగాడు.

ఇలా అడిగేసరికల్లా మహాగర్వి ఐన రాజకుమారి విరగబడి నవ్వ నారంభించింది : 'ఓరి నల్లోడా! నీకూ పెళ్ళాం కావాలేం!!' అంటూ వెటకారంచేసింది. ఆమెతోపాటు చుట్టూవుండే పరిచారికలందరూ వాడిని చూచి వేళాకోళంగా నవ్వసాగారు. ఈ పరాభవానికి వానికి కష్టం తోచింది. మండిపడ్డాడు నల్లోడు. 'నా తంబురపాటకే మహిమ ఉండటం సత్యమైతే, ఈ రాజకుమారికి పట్టిన గర్వం అనే మాలిన్యం తొలగిపోవుగాక!' అని అప్రయత్నంగా అనేసి, తనమానాన తను పాటపాడుకొంటూ వెళ్లిపోయాడు.

* * *

మళ్ళీ రెండేళ్ళపాటు విరక్తిగా సంచారం చేస్తూ పోతున్న నల్లోడికి అకస్మికంగా ఏదో ఆలోచన స్ఫురించింది. శ్రీమంతుని భార్య తనకిచ్చిన అద్దంసంగతి ఇంతవరకూ వాడికి జ్ఞాపకమేలేదు. జ్ఞాపకం వచ్చి అందులో ఒక్కమారు చూచుకొనేసరికల్లా తన ప్రతిబింబం తనకే ఆశ్చర్యం కలిగించింది. ఆ అద్దంలో కనపడే ఛాయ నల్లోడిది ఎంత మాత్రమూ కానేకాదు. అది స్ఫురద్రూపి ఐన ఒక చక్కటి రాజకుమారుని బొమ్మ !!- ఏమిటీచిత్రం !!!




ఈ మార్పుకి అమితాశ్చర్యపోతూ, నల్లోడు పర్యటనం సాగిస్తూనే వున్నాడు. ఇప్పుడు అలవాటుయొక్క బలంవల్ల తన మట్టుకు తను నల్లోడినని అనుకొంటున్నాడే కాని, లోకంలో ఎవళ్లూ వాడిని అలా పిలవటంలేదు. పైగా, అందరూ ఇప్పుడు వాడిని ఎంతగానో అప్యాయంతో ఆదరిస్తూ, 'ఒక్క పాట పాడరూ !'అంటూ బ్రతిమాలసాగారు. అతడు గొప్ప పాటగాడు అని ఆబాలగోపాలమూ అనేకవిధాల మెచ్చుకొంటున్నారు.

ఒకరోజున మళ్ళీ ఇదివరకులాగానే నల్లోడికి ఒక పెద్ద జనసమూహం కనిపించింది. అది ఒక చిత్రమైన జాతర. ఆ జాతరలో అనేకమైన వేడుకలు ప్రదర్శింపబడుతున్నై. అందులోకల్లా గొప్ప ఆకర్షణ 'బంగారు రాణి.' నల్లోడుకూడా అక్కడి వేడుకలు చూడబోయాడు. అన్నీచూచి చిట్టచివరకు బంగారురాణిని చూడబోయాడు.

చూచి తెల్లబోయాడు. 'ఏమిటీ బంగారు రాణి ! మోసం ! ఈ బంగారు రంగు ఈమె పూసుకొన్నదా, లేక పుట్టుకతోనే వచ్చిందా ? పుట్టుకతో బంగారు ఛాయగల కన్య ఫలానాదేశంలో ఒక్కర్తే వున్నది...' అని ఇంకా యేమో అనబోయేసరికల్లా ఆ బంగారురాణి బిత్తరపోయింది. 'వీడెవడో తప్పక నాగుట్టు తెలిసినవాడే అయివుం

డాలె' అని అనుకుని 'మీరెవరు?' అని ఆత్రంగా ప్రశ్నించింది.

అందుకు అతడు 'నన్ను లోకంలో అందరూ నల్లోడు అని పిలుస్తారు...' అన్నాడు.

తన కళ్లను తనే నమ్మలేకపోయింది రాజకుమారి. 'ఏమిటీ! నల్లోడివా? నీవు నల్లోడివా?' అంటూ ఆశ్చర్యంతో, ఆత్రంతో అడిగింది. పరకాయించి చూచింది. రంగులో మార్పు ఉండవచ్చు కాని, ముఖంలో మార్పు ఏమీ కనపడలేదు. ఆమె వానిని గుర్తించింది. అమట్టునే పాదాలపై పడి, "నీవుచెప్పిన ఆ దురదృష్టవంతురాలైన బంగారు రాణిని నేనే. ఆనాడు నిన్ను హేళనచేసి నీమనసు కష్టపెట్టిన క్షణంనించీ నా బంగారుఛాయ కరగిపోయి, క్రమంగా ఇప్పటికి కారునలుపుగా మారిపోయాను. నన్నుచూచి అందరూ ఏవగించుకొన్నారు. చివరకు నా నలుపురంగు చూడగా నాపైన నాకే రోతపుట్టుకవచ్చింది. అందుకని విరక్తిభావంతో సంచారం బయలుదేరాను. దారిలో ఈ జాతరలు నిర్వహించే యజమాని నన్ను చేరదీసి, ఈవిధంగా పోషిస్తున్నాడు. నీ మనసు నొప్పించినందుకు నాకు తగిన ప్రాయశ్చిత్తమైంది. దైవసంకల్పంవల్ల మళ్ళీ మనం ఇక్కడ కలిశాము. క్షమించు. నా గర్వం అణగిపోయింది. దయవుంచి నాకుపెట్టిన శాపం తీసెయ్యి" అంటూ ప్రాధేయపడింది.

నల్లోడు జాలిపడ్డాడు. ఆమెను క్షమించాడు. మళ్ళీ హుషారుగా తంబుర పాడగా అంతలో ఆమె నలుపుపోయి, శరీరం తిరుగా బంగారుకాంతితో మెరిసింది. ఇద్దరూ పెళ్లి చేసుకుని సుఖంగావుంటున్నారు.

దేశంచేరుకొన్నాక అందరూ బంగారు రాణిని గుర్తుపట్టగలిగారు. కాని, 'నేను మీ నల్లోడినే!' అని ఎంతచెప్పినా, వాడి మాటలు ఎవ్వరూ నమ్మలేకపోయారు!






ఒక వూరిలో కట్టెలమ్ముకుని జీవించే కష్టజీవి ఒకడు ఉండేవాడు. వాడు అందరికంటె పెందలకడనే లేవటం, అడవికి పోవటం, కట్టెలుకొట్టి మోపుకట్టి తేవటం, అవి అమ్ముకొని పొట్టపోసుకోవటం—ఇదీ నిత్యకృత్యం.

తనగొడవ ఏదో తనదేకాని, వాడు ఒకళ్ల జోలికీ సొంటుకీ పోయేవాడుకాదు. పరమ సాత్వికుడు. పైగా మచ్చుకైనా దురభ్యాసాలేవీలేవు. 'ఫలానావాడు నమ్మకస్థుడు. న్యాయమైనధర తీసుకుని ఎండుకట్టెలు పట్టుకొచ్చివేస్తాడు. నిజంగా, కట్టెలు కావాలంటే వాడిపద్దనే వేయించుకోవాలె' అని చెప్పి అందరూ వాణ్ణిగురించి ఎంతగానో మెచ్చుకునేవాళ్ళు. వాడి దుస్థితికి జాలిపడేవాళ్లుకూడాను. వాడు కలిగినదానితో తృప్తిపడేవాడేకాని, కానికూటికి ఎన్నడూ ఆశించినవాడుకాదు. అంత మంచివాడు.

వాడు రోజూ అడవికి రాజుగారి కోట ముందునించి వస్తూ పోతూవుండాలి. అదే దారి. రాజుగారు పై అంతస్థునించి రోజూ వీడిని గమనిస్తూ వుండేవాడు. రాజు ఎంతో దయగలవాడు. పేదలపాలిటి పెన్నిధి అని పేరుపడ్డాడు. అటువంటిది అదేమోకాని, రాజుకు ఈ కట్టెలవాడిని చూచినప్పుడెల్లా చెప్పలేని బాధకలుగుతూ వుండేది. అయినా వాడివేపు చూడటం మానలేదు.

ఈబాధ కొంతకాలానికల్లా క్రమంగా ఒకవిధమైన ఆవేదనగా మారింది. కట్టెలవాడొక బద్ధశత్రువుగా కనిపింపసాగాడు. చివరకు ఈ వైరం బాగాముదిరి, వాడిని చంపివేస్తేకాని తనకు కసితీరదన్నంత క్రోధం ఉబికింది. అప్పుడు రాజు ఆలోచించాడు: 'కష్టజీవి ఐనటువంటి ఈ కట్టెలవాడు నాకేమి అపచారంచేశాడు! ఏం చేయగలడు? మరి, వాడిని చూచినంతనే నా

కె. ఎ. అబ్దుల్ రహిమాన్ - నగరి



కెందుకింత బాధ కలగాలె?' ఈవిధంగా తనలో తనే ప్రశ్నించుకొంటూ, కారణం తెలియక మనోవేదనతో కుమిలిపోజొచ్చాడు. నిజానికి రాజు అలా కుమిలిపో నవసరం లేనేలేదు. 'ఈ కోటముందునించి వెళ్ల కూడదు' అని ఆజ్ఞాపించి వాడు తన కంట బడకుండా నిమిషంలో చేసుకోవచ్చు. కాని, రాజు అలా అధికారం వినియోగించి ఈ బాధ తొలగించుకో దలుచుకోలేదు. దీనికి మూలకారణం ఏమిటా అని తెలుసుకోవటానికి అయన ఆత్రపడసాగాడు.

ఇంతలో మంత్రి వచ్చి, ప్రభువు విచారంగా వుండటం కనిపెట్టాడు. సంగతి సందర్భాలు తెలియగానే అతనికీ చాలా అశ్చర్యం వేసింది. వెంటనే, కట్టెలవాని అంతర్యం తెలుసుకోవటానికని గూఢచారులను నియమించి, తను స్వయంగా వేయికన్నులతో కనిపెట్టసాగాడు. ఎక్కడికిపోయి ఎంత మందిని అడిగినప్పటికీ కట్టెలవాడిని గురించి మంచిగానే చెబుతూవచ్చారు. 'అమాయకుడు, కష్టజీవి, న్యాయశీలుడు' అనే మాటలేకాని, ఒక్కళ్ల నోటివెంటనైనా వాడినిగురించి ప్రతికూలమైన వాక్కు ఒక్కటీ వెలువడలేదు.

మంత్రికి ఎన్నాళ్లకూ అచూకీ ఏమీ దొరికిందికాదు. 'నీ తెలివితేటలింతేనా!' అని రాజు అనేస్తాడేమోనని జంకుకలిగింది. ఆఖరుయత్నంగా అతడు ఒక్కపనిచేశాడు. హఠాత్తుగా ఒకనాటిరాత్రి వాడియిల్లు సోదా చేదామని తలచి వెళ్ళాడు. వెళ్ళాడేకాని, ఆ పూరిగుడిసెలో ఏమున్నదిగనక?—ధనధాన్యాలా? దొంగసొత్తులా, ఏమన్నానా? ఒకమూల కొన్ని కట్టెలుమాత్రం గుట్టగా పడివున్నై. వాడివృత్తే యిదికదా! కనుక, తప్పుపట్టటానికేమీ కనిపించలేదు.

ఏమీతోచక మంత్రి, తమాషాకోసం 'ఏమిరా అబ్బీ! ఇవాళ కట్టె లమ్ముడు

కాలేదా, అక్కడ పడివున్నయే?' అని అడిగాడు. 'అవి అమ్మకానికి కావులెండి!' అంటూ నసిగేశాడు వాడు. మంత్రికి ఆత్రం కలిగి, గుట్టదగ్గరగా వెళ్ళాడు. అతడు అలా వెళ్ళిచూడటం ఇష్టంలేనట్టు సూచించాడు కట్టెలవాడు. మంత్రి ఒక కట్టెతీసి చూచి, మళ్ళీ ప్రశ్నించాడు. ఇక తప్పనిసరి కావడంవల్ల 'అవి మామూలు కట్టెలు కావండి, మంచిగంధపు కట్టెలండి!' అని నిజం చెప్పివేశాడు కట్టెలవాడు.




'అలైతే యింకేమిరా! వట్టి అమాయకుడివిలాగా వున్నావే? ఇవి అమ్ముకుంటే మంచి ధరవస్తుంది కదటరా?' అన్నాడు మంత్రి, వాడిహితవు కోరుతూ. కట్టెలవాడి మొగం జేవురించింది. మంత్రి పాదాలమీద పడి, 'క్షమిస్తానంటే చెబుతా' నన్నాడు. మంత్రి అభయమిచ్చేసరికి వాడు చెప్ప సాగాడు: 'అయ్యా! నా కడుపులో ఉద్దేశం చెప్పివేస్తున్నా, మన్నించండి. మన ప్రభువు కరుణాసింధువు. పేదవాళ్లందరకూ ఆయనంటే ప్రాణం. నేనూ ప్రభువుకు జోహారు చేస్తా. ఐతేనేం—నన్నుపట్టి పీడిస్తూవున్న దారిద్ర్య బాధవల్ల నాకొక దుర్బుద్ధిపుట్టింది. ఏలినవారు ముసిలివారయ్యారుకదా. ఇంకెంతకాలం జీవించబోతారు? వారు గతించినరోజున మంచిగంధపు చెక్కలకు గిరాకీ తగులుతుంది. కనుక, గంధపు చెక్కలు జాగ్రత్త చేసినట్టయితే ఆరోజున చెప్పిన వెలయిచ్చి తీసుకొంటారు. నాకు పట్టిన దరిద్రం తీరిపోతుంది...' అనేసరికి మంత్రి నిశ్చేష్టుడైనాడు.

రాజుకు ఈ వర్తమానం తెలియగానే కట్టెలవాడి ఆవేదన గుర్తించి, వాడి దరిద్రం తీరేటట్టు కొల్లలుగా ధనమిచ్చి పంపాడు. తన మనసులో బాధకు కారణం పరోక్షంగా వాడు అనుభవించే ఈ వేదనే ఐవుంటుందని రాజు అప్పుడు నిశ్చయించాడు.




అన్నప్పశాస్త్రి జ్యోతిషం చెప్పి జీవనోపాధి చేస్తూ ఉండేవాడు. ఆయన జ్యోతిషం కచితంగా దాఖలా ఈయటంవల్ల ఒక శ్రీమంతుడు శాస్త్రికి ఒక ఆవును బహుమతిగా ఇచ్చాడు. ఆయన పాలుపితుక్కోగానే ఆవుని ఊరుమీద వదిలేసేవాడు.

ఇలా వదిలేయటంవల్ల ఆ ఆవు రాత్రిళ్లు చేలు పాడుచేసేది. పగటిపూట ఊళ్లో పసిబిడ్డలను తొక్కి వేస్తూవుండేది. ఇది ముఖ్యంగా పొరుగున ఉండే రామమూర్తి మేష్టారుకి చాలా ఇబ్బంది ఐంది. ఏమంటే ఆయనకు ఇంటినిండా పిల్లలే. ఆవు కంట పడినప్పుడల్లా హడలుగానే వుండేది—ఏ బిడ్డకు అది ఏం ప్రమాదం కలిగిస్తుందోనని.

నయానా భయానా చిలక్కి చెప్పినట్టు శాస్త్రితో చెప్పారు మేష్టారు, ఆవును కట్టి వెయ్యమని. శాస్త్రులు వినిపించుకోక 'భయం భక్తి లేకుండా పిల్లల్ని వీధుల్లో వదిలేయటం ఏమిటి? నేను ఆవునుకట్టేది లేదు. ఇష్టంవచ్చిన పని చేసుకోండి' అని బుకాయించాడు.

'శాస్త్రుల్లుకి బుద్ధిచెప్పాలె' అని నిశ్చయించాడు మేష్టారు. మరునాడు తెల్లవారేసరికల్లా మేష్టారి యింటిముందు ఒక బోర్డు వెలిసింది! ఆ బోర్డుపైన ఇలా వున్నది:

"ఉచితం! అద్భుత జ్యోతిషం!! ఒకానొక యోగపుంగవుని వరప్రసాదం. లోకోపకారార్థం ఉచితంగా చెప్పమని కూడా ఆ మహామహుని ఆజ్ఞ. తరుణం పోగొట్టుకొనకండి! ప్రజ్ఞలుచెప్పి ప్రజలను దోచుకొనే మోసకారులనూ, వేషధారులనూ నమ్మకండి! సమయం: ఉదయం 7 నుండి 9 వరకు. సాయంత్రం 4 నుండి 6 వరకు."

మామూలుగా అన్నప్పశాస్త్రిగారింటి అరుగుమీద కూర్చుని, ఆయనకోసం కనిపెట్టుకొనివుండే జనాన్ని అందరినీ మేష్టారి

యస్. కోదండపాణి - మదనపల్లి

ఇంటిముందువుండే ఈ బోర్డు గప్పున అకర్షించింది. వెంటనే వాళ్ళు మేష్టారింటికి వచ్చేశారు. శాస్త్రుల్లు యింటిదగ్గరమో స్తరుగా ఇక్కడ అరుగులమీద పడిగాపులు పడటం అవసరంలేకపోయింది. విశాలమైన మేష్టారి ఇంటిలోకి సరాసరి వెళ్ళిపోయి, సావిట్లో కుర్చీలమీద సుఖంగా కూర్చోవచ్చు. ఇందుకుతోడు, ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకండా, కేవలం పారమార్థికచింతతో, ఈ మానవసేవ చేయటానికి పూనుకొన్నారాయె! ఎంత ఔదార్యం!! అందరూ సంతోషించారు.

ఇన్నిన్ని అనుకూలాలు ప్రత్యక్షంగా, అగపడుతూవుండగా ఆ శాస్త్రుల్లు మొహం ఎవడుచూస్తాడు? 'ఆ శాస్త్రుల్లు జ్ఞానం అర్థకుశిజ్ఞానం. పొట్టకూటికోసం ఏవో నాలుగు ముక్కలు నేర్చుకుని నాటక మాడుతున్నాడేగాని, నిలబెట్టి అడిగితే జవాబుచెప్పగల ప్రజ్ఞ ఎక్కడేడిసింది? పైగా నలుగురూవచ్చి నాలుగువిధాలా ముట్టజెప్పితేకాని పాయిలో పిల్లిలేవదాయె'— అని ఈవిధంగా ప్రజలలో అల్లుకుపోయే సరికి, శాస్త్రుల్లు ఇంటిమీద ఒక్క కాకి కూడా వాలటం మానివేసింది. ఆయన నోట్లో కరక్కాయ పడింది.

నాలుగుపూటలకల్లా కటకటలాడి పోయాడు శాస్త్రుల్లు. రెండోకంటివాడికి తెలియకుండా రాత్రికి రాత్రిపోయి మేష్టారి కాళ్లమీదపడి బుద్ధివచ్చిందనిచెప్పి లెంపలు వేసుకొన్నాడు. మళ్ళీ చెప్పించుకోకుండా తక్షణమే అపును కట్టి వేశాడుకూడా.

యథాప్రకారం మరునాడు అందరూ మేష్టారింటికి వచ్చారు. కాని, బోర్డు లేదు!! వచ్చినవాళ్ళంతా 'ఏమిటీ చిత్రం?' అంటూ. మేష్టారిని ప్రశ్నించారు.

'ఏమీలేదు. మేష్టరీ చేసేవాళ్ళు ఈపని చేయకూడదని ప్రభుత్వపుఆర్డరు వచ్చింది' అని చెప్పి తప్పించుకున్నాడు రామమూర్తి మేష్టరుగారు.



# మణులు-రత్నాలు

కొన్నివేల సంవత్సరాలక్రిందట ఆరావళీ పర్వతప్రాంతాన్ని ఒకరాజు పాలిస్తుండే వాడు. అతనికి విమల, శ్యామల అని యిద్దరు కుమార్తెలు. వారిద్దరూ అపురూప సౌందర్యవతులు.

ఒక యోగిపుంగవుని వరప్రసాదంవల్ల బాల్యంలోనే వాళ్ళిద్దరికీ ఒక వింతశక్తి లభించింది. విమల ఏకారణంవల్లనైనా నవ్వితే నోటినుంచి రత్నాలు రాలేవి. శ్యామల యెందుచేతనైనా ఏడిస్తే, ఆమె కంటినుంచి కారే ప్రతి నీటిబిందువూ ఒక దివ్యమణిగా మారేవి.

యోగిపుంగవుని వరానికి రాజూ రాణీ యెంతగానో సంతోషించారు. ఏకారణంవల్ల నైనా ధనాగారం దివాలాతీయడమంటూ జరిగితే, కుమార్తెల నవ్వువల్ల, ఏడ్పువల్ల రత్న, మాణిక్యాలతో ఖజానాను నింప వచ్చుకదా అని వాళ్ల ధీమా.

పాపం! ఆ దంపతులు నోట పలికినట్టే కొద్దికాలంలో ధనాగారం దివాలాతీసింది. కాని, వారు ఆశించినవిధంగా విమల నవ్వు వల్ల, శ్యామల యేడుపువల్ల అది తిరిగి నిండేమార్గం కనబడలేదు.

ఎంత నవ్వుకలిగించే మాటలు చెప్పినా విమల పెదవులు నవ్వేవికావు. ఎన్ని విచార కరమైన వార్తలు చెప్పినా, శ్యామల కంటి వెంట ఒక్క నీటిచుక్కయినా రాలేదికాదు.

ఇదిచూచిరాజుకు మతిపోయినట్టయింది. మంత్రితో చాలదూరం యోచించాడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణ యాన్ని ప్రకటనద్వారా ఖండ ఖండాంత రాలకూ చాటింపించారు. ఎవరైనాసరే తన కుమార్తెలైన విమలకూ, శ్యామలకూ నవ్వూ, విచారమూ కలిగించగలిగితే వారికి అర్థరాజ్యంతోసహా ఆ పిల్లను, ఇస్తామని ఆ ప్రకటన.

సి. వైదేహి - అనంతపురం

ఎందరెందరో రాకుమారులు, రాసాగారు. తమ తెలివితేటలను ఎంతగా ఉపయోగించి ఎన్ని కథలు చెప్పినా విమల నవ్వలేదు, శ్యామల విచారించలేదు. వారుచెప్పే కథలు వింటే చుట్టుప్రక్కలవాళ్లంతా పొట్టలు చెక్కలయ్యేట్టు నవ్వుతూంటే విమల మట్టుకు విచారవదనంతో కన్నీరుకార్చేది. విచారం కలిగించే కథలు వింటూ అందరూ దుఃఖంతో విలపిస్తూ కన్నీరు కారుస్తూంటే శ్యామల ఫక్కుమని పకపక నవ్వేది.

ఇలా కొంతకాలం గడిచింది. నిరాశతో, నిస్పృహతో అనేకమంది రాకుమారులూ, ఇతర యువకులూ తిరిగిపోసాగారు. రాజూ, రాణీ గత్యంతరంతోచక తీరని విచారంతో కుమిలిపోసాగారు.

ఇలావుండగా ఒకనాడు యువకుడొకడు రాజభవనానికి వచ్చాడు. అతనిపేరు ఆదిత్యుడు. ఆదిత్యుడు మనస్తత్వ శాస్త్రంలో నిధి.

"రోజూ యింతింతమందిని నాదగ్గరకు యెందుకు తీసుకువస్తారు? నాకు నవ్వడమే చేతకాదు" అంటూ విసువు కనబరచిన విమలను ఆదిత్యుడు చూడటానికి రాజు అనుమతించాడు.



అందరిలాగా ఆదిత్యుడూ విమలవద్దకు వెళ్లి కథచెప్ప నారంభించాడు. ఐతే, ఇది నవ్వించే కథకాదు, దుఃఖాన్నికలిగించే కథ. అందరూ విస్తుపోయారు.

కథ వింటూన్న అందరూ ఐదారునిమిషాలకే దుఃఖంలోమునిగి శోకాలు ప్రారంభించారు. కాని, రాకుమార్తె నిబ్బరంగా ఉన్నట్టేవుండి ఒక్కమారుగా పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వింది. ఆ నవ్వుతో ఆమె నోటి నుండి వింతకాంతులు వెదజల్లే రంగు రంగుల రత్నాలు కిందవున్న రత్నకంబళి మీద రాలినై. అందరి ఆశ్చర్యానికీ మేరలేక పోయింది.



ఆదిత్యుడు కథచెప్పడం ప్రారంభించాడు. ఐతే, ఇది ఎలాంటి కథ? చచ్చేవాడుకూడా లేచివచ్చేటంత పొట్ట చెక్కలయ్యేట్టుగా నవ్వుపుట్టించే హాస్యకథ!

రాజూ రాణీ పరివారమూ ఆదిత్యుడి కథ వింటూ పొట్టలు బద్దలయ్యేలాగా నవ్వేస్తున్నారు. కాని, వింత ఏమిటో, రాకుమారి ఐన శ్యామలమాత్రం ఒక్కసారిగా భోరుమని ఏడుస్తూ, బొటబొట కన్నీరుకార్చింది. ఒక్కొక్క కన్నీటిబొట్టు ఒక్కొక్క ధగధగ మెరిసే దివ్యమణిగా మారి, ఆమె పట్టు పరుపులమీద దొర్లసాగింది.

అందరూ మరిఒకసారి ఆశ్చర్యపోయారు. ఆదిత్యుడు అర్ధరాజాన్నీ రాకుమారినీ గెలుచుకున్నట్టే అని అనుకున్నారు.

ఇంతలో మంత్రి చెవిలో రాజు ఏదో ధర్మసందేహాన్ని వెలువరించాడు.

రాజు రాణీతో ఏదో అంతరంగికంగా గుసగుసలాడి, "ఆదిత్యుడు అసామాన్య శక్తివంతుడనేందుకు సందేహంలేదు. రాకుమార్తె లిద్దరినీ వివాహమాడడం శాస్త్ర విరుద్ధంకదా! కనుక, అతను ఎవరినైతే కావలెనంటాడో ఆ రాకుమారినుంచి రెండవ ఆమెకంటె ఎక్కువ రత్నాలనో మణులనో

ఇంతలో రాజుచెవిలో రాణీ ఏదో ధర్మ సందేహాన్ని వెలువరించింది.

అప్పుడు రాజు మంత్రితో ఏదో అంతరంగికంగా గుసగుసలాడి "ఆదిత్యుడు అసామాన్య శక్తివంతుడనేందుకు సందేహం లేదు. ఇక కుమారి శ్యామల కండ్లవెంట అశ్రువులు రాలేటట్లు చేయడమే తరువాయి. నా ప్రకటనలోని వాగ్దానాన్ని నేను తప్పక నెరవేరుస్తాను" అన్నాడు.

ఆదిత్యుడు నిరుత్సాహపడలేదు. రాజు పరివారంతోకూడ శ్యామల అంతఃపురంలో ప్రవేశించాడు. శ్యామల చెలికత్తెలతో పట్టు పరుపులమీద సుఖాసీనురాలై వుంది.

వెలువడేట్టు చేయడమే తరువాయి. అలా అయితే, నా ప్రకటనలోని వాగ్దానాన్ని నేను నెరవేరుస్తాను" అన్నాడు.

ఈమాటలు వినగానే ఆదిత్యుడు నిరుత్సాహపడ్డాడు.

మేలిమిని కూడా మించిన పసిమి కాంతులు వెదజల్లే శిరోజాలతో దేవకన్యలా వున్న విమలను వివాహమాడాలెనని అతని కోర్కె. కాని రాజు మాటలలో గల గూఢార్థం యిందుకు ప్రతిబంధక మవుతుం దేమోనని అతడికి జంకు కలిగింది. అయినా నిరుత్సాహపడలేదు.

విమలనూ, శ్యామలనూ ప్రక్క ప్రక్కగా కూర్చోపెట్టారు. ఏదైనా ఒకేకథ చెప్పి విమల నవ్వేటట్లుగానూ, శ్యామల దుఃఖించేటట్లు గానూ ఆదిత్యుడు చేయవలసివుంది. ఆ సందర్భంలో విమల నవ్వినప్పుడు రాలే రత్నాలూ, శ్యామల దుఃఖించినప్పుడు కన్నీటినుంచి జారే మణులూ లెక్కించి, ఏవి ఎక్కువ సంఖ్యలో వుంటే వారిని ఆదిత్యుడు భార్యగా స్వీకరించాలి.

ఈ చిత్రమైన షరతు ఎలా నెరవేరు తుందా అని అందరూ ఆత్రంతో చూస్తూ వున్నారు.




ఆదిత్యుడు ఈవిధంగా కథ ప్రారంభించాడు :

"అనగా అనగా ఒక అడవి. అందులో సౌందర్యవతిఐన ఒక పల్లెపడుచు. ఆమె పినతల్లి బ్రహ్మరాక్షసి. ఆ పడుచును అకారణంగా నానాహింసలూ పెడుతూండేది". కథ ఇక్కడవరకూ వచ్చేసరికి విమల ఫక్కుమని నవ్వింది. రత్నాలు రాలినై. లెక్కపెట్టారు. తనధోరణిలో కథ చెప్పుకొని పోతున్నాడు ఆదిత్యుడు.

"రూపవంతుడూ మహాబలశాలి అయిన ఒక రాజకుమారుడు ఆ పడుచును చూచి మోహించాడు. ఇద్దరూ ఒకనాటి రాత్రి

ఇంటినుండి పారిపోయేందుకు యోచన చేశారు." కథ ఇంతవరకూ వచ్చేసరికి శ్యామల పెద్దగా ఏడుస్తూ బొటబొట కన్నీరు కార్చింది. మణులు రాలినై, లెక్కపెట్టారు.

ఇలా నవ్వుపుట్టించే సంఘటనల్నీ, దుఃఖంకలిగించే సందర్భాలను పడుగూ పేకలాగా అల్లి ఆదిత్యుడు కథను చెప్ప సాగాడు.

అరగంట అయింది. కథ ముగియబో తున్నది. ఆ సమయానికి లెక్కవేసిచూడగా విమలకన్న శ్యామల పదిమణులను తన కన్నీటిద్వారా యెక్కువ రాల్చగలిగింది. ఇక ముగింపు దుఃఖాంతంచేస్తే విమల తన నవ్వుతో ఆ పదిమణులకన్న ఎక్కువగానే రాల్చగలదు.

విజయం నిశ్చయమన్న నమ్మకంలో అదిత్యునికి మైమరపు కలిగింది. కథను దుఃఖాంతంచేయవలసి వున్నదన్న మాటనే అతడు మరచిపోయాడు. ఒళ్ళుమరచి, ఉత్సాహంలో చెప్పుకొనిపోతున్నాడు:

"పినతల్లి పన్నిన అనేక మాయోపాయాలనుంచి బయటపడి, ఆ పల్లె పడుచూ, రాకుమారుడూ వివాహమాడి సుఖంగా కాలంగడిపారు" అని ముగించాడు.

పొంగిపొరలే దుఃఖంతో శ్యామల జల జలమని కన్నీటిబిందువులు రాల్చింది. అప్పటికే హెచ్చుగా వున్న పదిమణులకు తోడుగా యింకో పదిహేను చేరినై.

శ్యామలకూ ఆదిత్యుడికీ వివాహం జరిగి పోయింది. కథ అడ్డంతిరిగిందన్న విచారం అతణ్ణి ఆట్టేకాలం బాధించలేదు. ఎందు కంటే శ్యామల సౌందర్యవతి కాకపోలేదు. పైగా, వైవాహిక జీవితంలో అప్పుడప్పుడూ దుఃఖకారణాలంటూ వుండకతప్పదు కనుక, ఆ సమయాల్లో అతడికి కావలసి నన్ని మణులు దొరుకుతూవుండేవి.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

**అడ్డము:**

2. ఇంద్రుడు
4. జుట్టుముడి
6. అప్పు
7. చివర
8. సేన
10. మోసము
12. సౌందర్యము
14. చంద్రగుప్తుడి తల్లి
15. ఒక రామభక్తురాలు




**నిలువు:**

1. ముక్కు
2. ప్రవహించు
3. రక్షించు
5. మందిగము
6. తప్పనిసరి
9. సంతోషము
11. ఇంద్రజాలము
12. పార్వతి
13. దగ్గర

# వినోద చదరం



దిగువను ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోను చివరి రెండు అక్షరాలూ ఒకేలాగ వస్తాయ్. దీనిని పూర్తిచేయగలరేమో చూడండి.

మీకు తెలియకపోతే జవాబుకి

54-వ పేజీ చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |
| 4. | | | |
| 5. | | | |
| 6. | | | |
| 7. | | | |

**ఆధారములు:**

1. ప్రభువు
2. పాయ
3. చిన్న ఈక
4. చిన్నపిల్ల
5. సామ్యము
6. పురి
7. చింపిగుడ్డ




## అగ్గిపెట్టెలతో మరొక ట్రిక్కు

బల్లమీద మూడు అగ్గిపెట్టెలున్నాయి. వెనకాల మూడు గాజుగ్లాసులున్నాయి. మూడు గ్లాసుల్లోనూ మూడురంగుల సిల్కు రిబ్బన్‌ముక్కలున్నాయి. మొదటిగ్లాసులో ఎర్రరిబ్బన్, రెండోగ్లాసులో నీలిరిబ్బను, మూడోగ్లాసులో తెల్లరిబ్బను. (ప్రక్క చిత్రంచూడు.)

ఎర్రరిబ్బన్ గల గ్లాసుకు ఎదురుగావున్న అగ్గిపెట్టెమీద గుర్తుకు ఒకచిన్న ఎర్ర కాగితంముక్క అతికించి, ఆ పెట్టెలోకూడా ఎర్ర రిబ్బనుముక్క పెట్టి, దాన్ని బోర్లించి ఆ గ్లాసుదగ్గిరగా పెట్టాలి. అలాగే నీలపు రిబ్బన్‌వున్న గ్లాసుకు ఎదురుగానూ, తెల్లరిబ్బన్‌వున్న గ్లాసుకు ఎదురుగానూ, అగ్గిపెట్టెలు పెట్టాలి. తర్వాత ఇంద్రజాలికుడు మంత్రదండాన్ని వన్, టూ, త్రీ అని ఆ అగ్గిపెట్టెలకు తాకించి, వాటిని కొంచెం కదిలించి—ఒక్కొక్కటే తీసిచూపటం ప్రారంభిస్తాడు. అప్పుడు తెల్ల కాయితంముక్క అతికించిన అగ్గిపెట్టెలోంచి ఎర్రరిబ్బను, ఎర్ర కాయితమ్ముక్క అతికించిన అగ్గిపెట్టెలోంచి నీలపురిబ్బను,




నీలపు కాయితంముక్క అతికించిన అగ్గిపెట్టెలోంచి తెల్లరిబ్బను పైకివస్తాయి. ప్రేక్షకులు స్వయంగా వాటిని తీసుకుని చూసి ఆశ్చర్యపోతారు.

ఇది ఎలా అంటే: ఒకే ట్రేడ్‌మార్కు ఉన్న ఆరు అగ్గిపెట్టెల్ని సంపాదించాలి. వాటిల్లో మూడు పెట్టెల్ని మాత్రం తీసుకుని, మొదటి నెంబరు అగ్గిపెట్టెమీద తెల్ల కాయితమ్ముక్క గుర్తు, రెండోనెంబరు అగ్గిపెట్టెమీద ఎర్రకాయితమ్ముక్క గుర్తు, మూడోనెంబరు అగ్గిపెట్టెమీద నీలపు కాయితమ్ముక్క గుర్తులూ అదివరకే అతికించి ఉంచుకోవాలి. మిగిలిన మూడు అగ్గిపెట్టెలమీద లేబిల్సూ చిరిగిపోకుండా జాగ్రత్తగా ఊడతీసి, దానికి వెనుకవైపు న్యూస్‌పేపరు తాలూకు ముక్కలు అతికించి హెచ్చుతగ్గులు లేకుండా ఆ న్యూస్‌పేపరును ఈ లేబిల్‌తో సమానంగా నాలుగు వైపులా కత్తిరించాలి. ఈ ప్రక్కచిత్రంలో చూపించిన '1' గుర్తుకలది ఇలా విడిగా తయారుచేసిన లేబిల్. '2' గుర్తు గలది అసలు అగ్గిపెట్టె. అసలు అగ్గిపెట్టెమీద ఈ విడిలేబిల్‌పెట్టి చూపిస్తే ప్రేక్షకులు తెలుసుకోలేరు. ఈసారి మొదటి నెంబరు తెల్లలేబిల్ ఉన్న అగ్గిపెట్టెమీద పెడుతున్న విడిలేబిల్‌మీద ఎర్రకాగితం గుర్తు అతికించాలి. రెండోనెంబరు అసలు ఎర్రలేబిల్ ఉన్న అగ్గిపెట్టెమీద పెట్టే విడిలేబిల్‌మీద నీలపు కాగితంగుర్తు అతికించాలి. అలాగే మూడోనెంబరు అసలు నీలపుగుర్తు ఉన్న అగ్గిపెట్టెమీద చేర్చే విడిలేబిల్‌మీద తెల్ల కాయితం గుర్తు అతికించాలి.

ఇప్పుడు ఒకటి, రెండు, మూడు నెంబర్ల అగ్గిపెట్టెలు వరుసగా ఎరుపు, నీలం, తెలుపు రంగులు కలవిగా పైకి కన్పిస్తాయి. కాని వాటి అడుగున ఉన్నవి వరుసగా తెలుపు, ఎరుపు, నీలం రంగుల గుర్తులు. ఈ రహస్యం ప్రేక్షకులు గుర్తించలేరు. ఇహ పైకి కన్పిస్తున్న గుర్తుల ప్రకారమే మొదటి నెంబరు అగ్గిపెట్టెలో ఎర్రరిబ్బను, రెండో దాంట్లో నీలపు రిబ్బను, మూడోదాంట్లో తెల్ల రిబ్బన్లు పెట్టి—ఆ అగ్గిపెట్టెలను బోర్లించాలి. దానివల్ల అగ్గిపెట్టెపైనవున్న విడి లేబిల్—మళ్ళీ అగ్గిపెట్టె పైకి తీసేప్పుడు ఆ బల్లమీదే పడిఉంటుంది. అదివరకు బల్లమీద ఒక పెద్ద న్యూస్‌పేపరు పరిచి ఈ ట్రిక్కు ప్రారంభిస్తాము కనుక ఈ విడిలేబిల్ వెనుకవైపున అతికించిన న్యూస్‌పేపరుముక్కకూడా బల్లమీదవున్న న్యూస్‌పేపరు రంగుతో కలిసిపోతుంది. అతికించే కాగితం వీలైనంత పలచగా ఉండాలి.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19

# అట్టమీది బొమ్మ

శ్రీకృష్ణ బలరాములు విద్యలు నేర్చుకోవటం పూర్తికాగానే గురువువద్ద సెలవు తీసుకొంటూ, 'మేము మీకు ఈయగల దక్షిణ యేమిటో దయచేసి చెప్పండి' అని కోరారు. అందుకు గురువు 'అవతారపురుషులయినటువంటి మీరు నాకు ఈయతగిన ప్రతిఫలం ఒక్కటేవున్నది. చచ్చి స్వర్గానవున్న నా పుత్రుణ్ణి నాకు ప్రసాదించాలి' అంటూ తన కుతూహలం వెల్లడించాడు. అప్పుడు కృష్ణ బలరాములు ముల్లోకాలూ వెతికి, గురుపుత్రుణ్ణి పట్టితెచ్చి వప్పగించారు. గురువు సంతోషానికి మేరలేకపోయింది.

ఈ వార్త చెవినిపడగానే దేవకీదేవి విస్మయంపొందింది. ఆమెకు వెంటనే కంసుడు హింసించిన తన కుమారులు జ్ఞాపకానికి వచ్చి కన్నులవెంట జలజల బాష్పాలు రాలినై. అప్పుడామె రామకృష్ణులను పిలిచి, అతిదీనంగా "నాయనా!— నా కడుపున పుట్టిన మీరు భూభారం హరించటానికని వచ్చిన అవతారపురుషులన్నసంగతి ఎరుగుదును. మీకు అసాధ్యమనేది యేదీలేదని తెలుసు. ఏనాడో చచ్చిపోయిన పుత్రుని వెతికితెచ్చి గురుదక్షిణగా అర్పించినసంగతికూడా విన్నాను. కంసుడు వధించిన నా బిడ్డలను చూపించి పుణ్యంకట్టుకోరా?" అని కోరింది.

వెంటనే బలరామకృష్ణులు సుతలానికి చేరుకొన్నారు. అక్కడ ఇంద్రసేనుడు పరమ అహ్లాదంతో రామకృష్ణులను గౌరవించి, సమస్త ఉపచారాలూచేసి, "మహానుభావులారా!—దుర్లభమైన మీ దర్శనభాగ్యం మాకు లభించింది. ధన్యులమయ్యాము. మమ్మలిని అనుగ్రహించండి" అని ప్రార్థించారు.

అప్పుడు భగవానుడు "మహారాజా!—మొదట స్వాయంభువ మన్వంతరమందు అరుగురు కుమారులు జన్మించి శాపవశాన రాక్షసులై హిరణ్యాకశిపునకు పుట్టారు. ఆ తరువాత వారు దేవకి గర్భమందు జన్మించి వాళ్లను కంసుడు హింసించగా, ఇక్కడికి వచ్చివున్నారు. వీళ్లకోసం మా తల్లి శోకిస్తున్నది కాబట్టి మేము వీళ్లను తీసుకొనిపోదలిచాము. నా అనుగ్రహంవల్ల వీళ్లకు శాపంపోయి సద్గతులు పొందుతారు" అని చెప్పాడు.

అప్పుడు ఇంద్రసేన మహారాజు స్మరుడు, ఉదీథుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభువు, ఘృణి అనే అర్గురనూతెచ్చి వప్పగించేసరికి, శ్రీకృష్ణపరమాత్మ వాళ్లను వెంటబెట్టుకువెళ్లి తల్లియెదట ఉంచాడు. దేవకీదేవి మృతసుతుల రాకకు ఎంతగానో అనందించి, కృష్ణమాయకు ఆశ్చర్యపడింది.

# ఒంటిగీత బొమ్మ



పంపినవారు : వి. సరోజినీదేవి - కడప

# రంగుల బొమ్మ కథ—5-వ బొమ్మ

చెట్టుఆకారంలో వున్న ఒక భయంకరస్వరూపం శాన్‌మింగ్ చేతిని పట్టినట్టయిందని చెప్పాముకద!—శాన్‌మింగ్ హడిలిపోయింది. ఆ స్వరూపం ఆమెతో "రా అమ్మాయ్!—నావెంటరా. కట్టెలు కొట్టిపెడుదువుగాని" అని అనేసరికి, శాన్‌మింగ్‌కు మరీ అపరిమితమైన భయం పట్టుకున్నది.

అంతలోనే ఒకానొక యువకుడు అవైపు రాబోయాడు. అతడు రావటమే తడవుగా ఆ చెట్టు అకారం శాన్‌మింగ్ చేతిని అమట్టునే వదిలేసి, వాయువేగంతో పరుగుచ్చుకున్నది. శాన్‌మింగ్‌కు గొప్పగండం గడిచినట్టయింది. ఆవచ్చినతడు చాన్. ఎరిగివున్నట్టు సరిగా అతడు ఈ సమయంలోనే రావటం అదృష్టంగాక మరేమిటి అనుకొని శాన్‌మింగ్ సంతోషించింది. తన మనసులోని సంతోషాన్ని చాన్‌తో వెలిబుచ్చేటంతలో, ఇప్పటివరకు కదులుతూవుండిన గొడుగుపిడి గప్పుమని ఆగింది. ఇది గమనించిన శాన్‌మింగ్ ఆశ్చర్యానికి మేరలేకపోయింది.

"చాంగ్!—నీవు నాకుచేసిన ఉపకారం ఈ జన్మలో మరువరానిది. నీవంటి లోకోపకారిని చూస్తే మా నాయన ఎంతో కుతూహలపడతారు. రా, కోటలోకి వెళదాం" అంటూ తీసుకువెళ్లింది. శాన్‌మిగ్ తండ్రి ఈ చిత్రసంఘటన అంతా విన్నాడు. శూరుడు, వీరుడూ ఐన చాన్‌ను చూచి చాలా ముచ్చటపడ్డాడు.

"అబ్బాయీ!—మా అమ్మాయిని నీకు ఇద్దామనివుంది, పెళ్లిచేసుకుంటావా?" అని అడిగాడు. చాన్ కొంచెం సిగ్గుపడ్డాడు. అదే అతని అంగీకారంగా తీసుకుని, "చెప్పకపోతే పోనీలే. నువు చిన్నవాడవు. మీ నాయనతో మాటాడతాను. అయనను ఒకసారి నేను రమ్మన్నానని చెబుతావా?" అన్నాడు.

అందుకు చాన్ వినయంగా "నాకు నాయన లేరండి. మా అమ్మే నాకు పోషకురాలు" అని చెప్పాడు.

"అలాగా! తల్లిచాటుపిల్లవాడివా? బాగానేవుంది. ఒక్కసారి మీ అమ్మను రమ్మనమను" అని చెప్పగా, చాంగ్ ఇంటికివెళ్ళి తల్లిని పంపాడు. శాన్‌మింగ్ తండ్రి ఆమెతో పెళ్లిమాటలాడాడు. ఐతే, అమాటలలో తేలిన పర్యవసానం యేమిటో వచ్చేనెల బొమ్మతోసహా చదవండి.

49-వ పేజీలోని
పజిలుకి జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 నా | | | | 2 పా | 3 కా | రి |
| 4 సి | 5 గ | | 6 అ | రు | వు | |
| 7 క | డ | | ని | | | |
| | 8 ప | రి | వా | ర | 9 ము | |
| | | | ర్య | | 10 ద | 11 గా |
| | 12 అం | 13 ద | ము | | 14 ము | ర |
| 15 శ | బ | రి | | | | డి |

49-వ పేజీలోని
వినోద చదరానికి జవాబు :

| | | | |
|---|---|---|---|
| 1. | ఏ | లి | క |
| 2. | చీ | లి | క |
| 3. | తూ | లి | క |
| 4. | బా | లి | క |
| 5. | పో | లి | క |
| 6. | మె | లి | క |
| 7. | పే | లి | క |

## రాణిగారి తీర్పు

రంగాపురం యెస్టేటు ధనాగారానికి అధిపతి నమశ్శివాయ. అయన పిల్లలవాడు. ఎంత బిగబట్టుకునివున్నా, తనకు తెలియకుండానే ఖజానాలోనించి స్వంతానికి కర్చు అవుతూవుండేది. కొన్నాళ్ళకల్లా గుట్టు బయల్పడింది.

ఈ సమాచారం ఎస్టేటు పాలించే రాణిగారివరకూ వెళ్లింది. ఆమెకు తెలిసిందనగానే నమశ్శివాయ పిట్టకు తెలియకుండా పారిపోయాడు. దివానూ, ఇతర ఉద్యోగస్థులూ కారాలూ మిరియాలూ నూరారు. దుర్మార్గుడికి జైలుశిక్ష వేయించాలని సిఫారసుచేశారు.

అతణ్ణి వెతికిపట్టి తెమ్మన్నది రాణి. తమ మాట నెగ్గిందనుకున్నారు దివానూ వాళ్ళూ. నమశ్శివాయను పట్టితీసుక వచ్చి, రాణిఎదట పెట్టారు. నమశ్శివాయ వాడుకున్న సొమ్ము ఎనిమిదివందలు అని లెక్క తేలింది. అప్పుడామె 'అబ్బాయీ, నమశ్శివాయా !—పాపం. పిల్లలవాడవు. ఏదో పొరపాటు జరిగింది. నీ జీతం ఎనభైనుంచి నూరు చేస్తున్నాము. నెలకు ఇరవైచొప్పున నీవు వాడుకున్న సొమ్ము జమకడుతూవుండు. ఇదే నీకు శిక్ష. ఇటుపైన జాగర్తగా మసులుకో' అంటూ హెచ్చరించింది. ఆమె చాకచక్యానికీ, ఔదార్యానికీ అందరూ ఆశ్చర్యపోయారు.

విజయ వారి

# పెళ్ళిచేసి చూడు

40 కేంద్రాలలో విజయభేరి మ్రోగిస్తున్నది

నిర్మాతలు :
నాగిరెడ్డి & చక్రపాణి

డైరెక్టర్ :
ప్రసాద్




Printed by B. NAGIREDDI at the B. N. K. Press Ltd., Madras 24, and Published by him from Chandamama Publications, Madras 24, Controlling Editor : SRI CHAKRAPANI

